## రాజపూజ్యావమాన నిర్ణయః

| | పూజ్యతా | అవమానః | | పూజ్యతా | అవమానః |
|---|---|---|---|---|---|
| మేషస్య | ౫ | ౨ | తులాయాః | ౭ | ౭ |
| వృషభస్య | ౧ | ౩ | వృశ్చికస్య | ౫ | ౭ |
| మిధునస్య | ౪ | ౩ | ధనుషః | ౧ | ౫ |
| కర్కటకస్య | ౨ | ౩ | మకరస్య | ౪ | ౫ |
| సింహాస్య | ౩ | ౬ | కుంభస్య | ౨ | ౫ |
| కన్యాయాః | ౬ | ౬ | మీనస్య | ౩ | ౧ |

## అశ్విన్యాది నక్షత్రాణాం సంవత్సర ఫలం

అశ్వినీ పుష్య స్వాత్యభిజితాం భూషణమ్ ।
భరణీ ఆశ్లేషా విశాఖాశ్రవణానాం రోగః ।
కృత్తికా మఘాఽనురాధా ధనిష్ఠానాం ఆరోగ్యమ్ ।
రోహిణీ పూర్వఫల్గునీ జ్యేష్ఠా శతతారాణాం అర్థలాభః ।
మృగశిరా ఉత్తరఫల్గునీ మూలా పూర్వాభాద్రాణాం మనస్తాపః ।
ఆర్ద్రా హస్తా పూర్వాషాఢా ఉత్తరాభాద్రాణాం రాజమాన్యమ్ ।
పునర్వసు చిత్రా ఉత్తరాషాఢా రేవతీనాం యుద్ధమ్ ।

## చాంద్రార్ఘాః

చైత్ర అధికజ్యేష్ఠ నిజజ్యేష్ఠ పుష్య ఫాల్గునేష్వత్యర్ఘః ।
వైశాఖ ఆశ్వయుజ మాఘేషు శూన్యార్ఘః ।
ఆషాఢ శ్రావణ భాద్రపద కార్తిక మార్గశీర్షేషు సమార్ఘః ।

## సౌరార్ఘాః

మేష వృషభ సింహేషు సమార్ఘః ।
మిధున కన్యా తులా వృశ్చిక ధనుర్మకర మీనేషు శూన్యార్ఘః ।
కర్కటక కుంభయోరత్యర్ఘః ।

## కుజవక్ర ఫలం

శ్లో॥ యదా త్రయోదశే ధిష్ణ్యే వక్రితే వా చతుర్దశే ।
తద్వక్రం వ్యాళ సంజ్ఞం తన్మహాభీతిరనర్ఘదమ్ ॥

## మాసఫలం

శ్లో॥ పంచార్కవాసరే రోగాః పంచభౌమే మహద్భయం ।
దుర్భిక్షం పంచమందేషు శేషవారాశ్శుభప్రదాః ॥

# మకర సంక్రాంతి నిర్ణయః

అస్మిన్నబ్దే **పుష్యశుక్ల అష్టమీ తత్కాల నవమీ** ఇందువాసరే అశ్వినీ నక్షత్రే, సిద్ధ యోగే, బాలవ కరణే, తులా లగ్నే, చతుశ్చత్వారింశద్విఘటీ సహిత షట్చత్వారింశద్ఘటికా (౪౬.౪౪) భోగసమయే భానోర్మకర రాశిప్రవేశః. తత్ఫలమ్

## సంక్రాంతి పురుష లక్షణమ్



శ్లో॥ త్రిశీర్షం ద్విముఖం చైవ చతుర్వక్త్రం త్రినేత్రకమ్ ।
లంబకర్ణం రక్త దంతం లంబ భ్రూ దీర్ఘ నాసికమ్ ॥
అష్టబాహు ద్విపాదం చ వికృతం కృష్ణ వర్ణకమ్ ।
శతయోజనమౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశ స్మృతమ్ ॥
ఏవం రూపం సువిజ్ఞేయం సంక్రాంత్యాః పురుషస్య తు ।

అస్య పురుషస్య ధ్వాంక్ష నామధేయఫలం వైశ్యానాం శుభదం, చందనోదక స్నాన ఫలం సుభిక్షం, రక్త వస్త్రధారణఫలం రోగప్రదం. చందనగంధ ధారణఫలం విప్రానాం అరిష్టప్రదం. జాజీ పుష్పధారణ ఫలం సుశోభనం. ముక్తా భూషణఫలం శుభం. రజత పాత్రఫలం సుభిక్షం. పాయసాహార ఫలం పశునాశనం. కదలీఫల భక్షణ ఫలం ఫలనాశనం. భిండివాలాయుధ ధారణఫలం వ్యాధిభయం. రక్త ఛత్రధారణ ఫలం మహోౖహవః. వ్యాఘ్ర వాహన ఫలం అరణ్య మృగక్షయః. క్రోధముఖ చేష్టాఫలం జననాశనం. నివిష్టావస్థాఫలం మధ్యార్ఘః.

**దక్షిణదిగ్యాన ఫలం** : యద్దిఙ్ముఖగతో భానుస్తద్దేశే క్షామడాంబరం ।
విదిఙ్ముఖగతో భానుస్తద్దేశస్య శుభప్రదః ॥

**పక్షఫలం** : పుష్యమాసే యదా శుక్లే మకరస్థే దివాకరే ।
హాహాకారం జగత్సర్వం దుర్భిక్షం క్షామడాంబరమ్ ॥

**తిథిఫలం** : నృప వృద్ధిః. కించ ఈతి బాధాః.

**వారఫలం** : భృగ్విందు గురు సౌమ్యేషు యదా సంక్రమతే రవిః ।
సుభిక్షం క్షేమమారోగ్యం సువృష్టిస్సస్య సంపదః ॥

**కాలఫలం** : కాకాన్ హంతి.

**లగ్నఫలం** : అల్ప సుఖం.

**ముహూర్త ఫలం** : పశుహానిః.

శ్లో॥ సంక్రాంతి పుంసా ధార్యం హి వర్ణద్రవ్యం న వృద్ధిదం ।
తస్మాత్సర్వ ప్రయత్నేన వర్ణద్రవ్యం వివర్జయేత్ ॥

| | | | |
|---|---|---|---|
| రవి బుధ చంద్ర శుక్ర | | | |
| | వర్ష లగ్నం | | రాహు |
| కేతు | | | |
| కుజ శని | | గురు | లగ్నం |

| | | | |
|---|---|---|---|
| చంద్ర బుధ | రవి శుక్ర | | లగ్నం |
| | జగల్లగ్నం | | రాహు |
| కేతు | | | |
| శని కుజ | | గురు | |

ఈ సంవత్సరము వర్షలగ్నము కన్య. లగ్నాధిపతి బుధుడు కేంద్రమందుండి లగ్నమును చూచుట శుభప్రదము. అందుచే ప్రభుత్వము, దేశము క్షేమముగ నుండును. లగ్నమును పాపగ్రహము శని వీక్షించుచున్ననూ ఎక్కువ శుభగ్రహములు వీక్షించుటచే దేశము ఎక్కువ శుభఫలితములు పొందును. ద్వితీయ భాగ్యాధిపతి శుక్రుడు ఉచ్ఛస్థితి యందుండుటచే మరియు ద్వితీయమున గురువు ఉండుటచే ఆర్థిక రంగము విశేషముగ వృద్ధినొందును. దేశ సంపద పెరుగును. భాగ్యరాజ్యాధిపతులు కేంద్రమందుండుటచే దేశ సంపద, ఉపాధి అవకాశములు పెరుగును. దేశ, విదేశముల యందు కీర్తి ప్రతిష్ఠలు కలుగును. తృతీయ అష్టమాధిపతి కుజుడు, షష్ఠాధిపతి శనితో కూడి చతుర్థ కేంద్రమందుండి శుభగ్రహ వీక్షణ పొందక యుండుటచే దేశము కొన్ని ఇబ్బందులు కూడా ఎదుర్కొనవలసి యుండును. అలజడులు, ఆందోళనలు, ఉగ్రవాద కార్యకలాపములు హెచ్చగును. వర్షములు మధ్యమముగ నుండును. తూర్పున స్థిరమైన అధిక ధరలు, నేయి మొదలగువానికి కలుగును. పసుపు మొదలగు వానికి ఎక్కువ వెలలుండును. దక్షిణ వంగ దేశముల యందు వ్యాధులు కలుగును. పశ్చిమమున ఆహార ధరలు పెరుగును. విరోధములు కలుగును.

జగల్లగ్నమునాలోచించగా లగ్నమునకు సప్తమమున రెండు పాపగ్రహములు ఉండుటచే మరియు లగ్నము లగ్నాధిపతి పాపగ్రహములచే వీక్షించబడుటచే దేశమున కొంత అలజడి, అశాంతి అధికముగనే యుండును. 'సప్తమస్థో యదాపాపో ధాన్యజాతం వినాశయేత్' అని యున్నందున పంటలకు ఇబ్బంది వచ్చును. ద్వితీయ రాహువుకు కుజదృష్టి వలన ఆర్థిక పరిస్థితులలో మధ్యమధ్య కొన్ని ఇబ్బందులు కలుగును. నిఘా వ్యవస్థలో లోపములు బయట పడును. మొత్తము మీద కొన్ని ఇబ్బందులు ఉన్ననూ 'యదా శుభగ్రహైర్దృష్టం లగ్నం స్యాత్తు తదా శుభం, ధనధాన్యాది సంపూర్ణం సర్వం వర్షం శుభావహమ్' అని యున్నందున లగ్నమును గురువు వీక్షించుట వలన పర్యవసానము దేశము సుభిక్షముగ నుండగలదు. శ్రావణ, పుష్య మాసములు ఉత్తమ ఫలప్రదములుగ నుండి వృద్ధికరముగ నుండును. వైశాఖ, ఆశ్వయుజ, కార్తికములు అత్యంత క్లిష్టముగ నుండును. మాఘమాసము శుభాశుభ మిశ్రమముగ నుండును. మిగిలినవి యథోచితముగనుండును.

## రవి నక్షత్ర ప్రవేశకాల సూచికా

| ఆంగ్ల తేది | మాసతిథివారః | నక్షత్రము | ఘ.విఘ | స్త్రీ.పు.న | లగ్నము | జలరాశులు | వాహనము |
|---|---|---|---|---|---|---|---|
| 18-03-18 | చైత్ర శుక్ల ౧ ఆది | ఉత్తరాభాద్ర | ౯.౯ | పు.పు | వృషభం | అర్ధజల | ఆఖువు |
| 31-03-18 | చైత్ర శుక్ల ౧౫/కృష్ణ ౧ శని | రేవతి | ౩౬.౧౧ | స్త్రీ.పు | తుల | పాదజల | మయూరము |
| 14-04-18 | చైత్ర కృష్ణ ౧౩/౧౪ శని | అశ్విని | ౧౦.౧౬ | పు.పు | మిధునం | నిర్జల | అశ్వము |
| 27-04-18 | వైశాఖ శుక్ల ౧౨/౧౩ శుక్ర | భరణి | ౫౧.౨౮ | స్త్రీ.పు | కుంభం | అర్ధజల | మండూకము |
| 11-05-18 | వైశాఖ కృష్ణ ౧౧/౧౨ శుక్ర | కృత్తిక | ౩౯.౧ | పు.పు | ధనుస్సు | అర్ధజల | గార్దభము |
| 25-05-18 | అధిక జ్యేష్ఠ శుక్ల ౧౧ శుక్ర | రోహిణి | ౩౨.౫౩ | పు.పు | వృశ్చికం | పాదజల | ఆఖువు |
| 08-06-18 | అధిక జ్యేష్ఠ కృష్ణ ౯/౧౦ శుక్ర | మృగశిర | ౩౧.౫౨ | నపు.పు | వృశ్చికం | పాదజల | మేషము |
| 22-06-18 | నిజ జ్యేష్ఠ శుక్ల ౯/౧౦ శుక్ర | ఆర్ద్ర | ౩౪.౭ | స్త్రీ.స్త్రీ | ధనుస్సు | అర్ధజల | గజము |
| 06-07-18 | నిజ జ్యేష్ఠ కృష్ణ ౭/౯ శుక్ర | పునర్వసు | ౩౭.౧౬ | పు.స్త్రీ | మకరం | పూర్ణజల | మండూకము |
| 20-07-18 | ఆషాఢ శుక్ల ౭/౯ శుక్ర | పుష్యమి | ౪౧.౪౨ | పు.స్త్రీ | కుంభం | అర్ధజల | అశ్వము |
| 03-08-18 | ఆషాఢ కృష్ణ ౬/౮ శుక్ర | ఆశ్లేష | ౪౨.౩౬ | స్త్రీ.పు | మీనం | పూర్ణజల | జంబుకము |
| 17-08-18 | శ్రావణ శుక్ల ౮ శుక్ర | మఘ | ౩౯.౧౦ | స్త్రీ.స్త్రీ | మీనం | పూర్ణజల | మహిషము |
| 31-08-18 | శ్రావణ కృష్ణ ౫ శుక్ర | పూర్వఫల్గుని | ౩౦.౦ | స్త్రీ.పు | కుంభం | అర్ధజల | గజము |
| 14-09-18 | భాద్రపద శుక్ల ౫ శుక్ర | ఉత్తరఫల్గుని | ౧౪.౩౪ | స్త్రీ.స్త్రీ | వృశ్చికం | పాదజల | మయూరము |
| 27-09-18 | భాద్రపద కృష్ణ ౨/౩ గురు | హస్త | ౫౨.౭ | పు.స్త్రీ | కర్కటకం | పూర్ణజల | అశ్వము |
| 11-10-18 | ఆశ్వయుజ శుక్ల ౨/౩ గురు | చిత్ర | ౨౨.౪౮ | స్త్రీ.స్త్రీ | కుంభం | అర్ధజల | మండూకము |
| 24-10-18 | ఆశ్వయుజ శుక్ల ౧౫ బుధ | స్వాతి | ౪౬.౨౭ | స్త్రీ.పు | కర్కటకం | పూర్ణజల | మయూరము |
| 07-11-18 | ఆశ్వయుజ కృష్ణ ౩౦ బుధ | విశాఖ | ౪.౫ | స్త్రీ.స్త్రీ | వృశ్చికం | పాదజల | గజము |
| 20-11-18 | కార్తిక శుక్ల ౧౨/౧౩ మంగళ | అనూరాధ | ౧౬.౦ | పు.స్త్రీ | కుంభం | అర్ధజల | జంబుకము |
| 03-12-18 | కార్తిక కృష్ణ ౧౧/౧౨ సోమ | జ్యేష్ఠ | ౨౩.౪౩ | స్త్రీ.స్త్రీ | మేషం | పాదజల | గార్దభము |

| ఆంగ్ల తేది | మాసతిథివారః | నక్షత్రము | ఘ.విఘ | స్త్రీ.పు.న | లగ్నము | జలరాశులు | వాహనము |
|---|---|---|---|---|---|---|---|
| 16-12-18 | మార్గశిర శుక్ల ౯ ఆది | మూల | ౨౭.౩౧ | నపు.పు | వృషభం | పాదజల | అశ్వము |
| 29-12-18 | మార్గశిర కృష్ణ ౭/౮ శని | పూర్వాషాఢ | ౨౯.౪౦ | స్త్రీ.పు | మిథునం | నిర్జల | మండూకము |
| 11-01-19 | పుష్య శుక్ల ౫/౬ శుక్ర | ఉత్తరాషాఢ | ౩౧.౧౭ | స్త్రీ.పు | కర్కటకం | పూర్ణజల | మయూరము |
| 24-01-19 | పుష్య కృష్ణ ౪ గురు | శ్రవణం | ౩౪.౧౭ | పు.స్త్రీ | సింహం | నిర్జల | అశ్వము |
| 06-02-19 | మాఘ శుక్ల ౨ బుధ | ధనిష్ఠ | ౩౯.౫౦ | స్త్రీ.నపు | తుల | పాదజల | జంబుకము |
| 19-02-19 | మాఘ శుక్ల౧౫/కృష్ణ ౧ మంగళ | శతతార | ౪౯.౩౫ | నపు.స్త్రీ | ధనుస్సు | అర్ధజల | మయూరము |
| 05-03-19 | మాఘ కృష్ణ ౧౪ మంగళ | పూర్వాభాద్ర | ౪.౧౭ | పు.స్త్రీ | మీనం | పూర్ణజల | అశ్వము |
| 18-03-19 | ఫాల్గున శుక్ల ౧౨/౧౩ సోమ | ఉత్తరాభాద్ర | ౨౪.౪౬ | పు.స్త్రీ | సింహం | నిర్జల | జంబుకము |
| 31-03-19 | ఫాల్గున కృష్ణ ౧౧ ఆది | రేవతి | ౫౧.౪౫ | స్త్రీ.స్త్రీ | మకరం | పూర్ణజల | గార్ధభము |

శ్లో ॥ స్త్రీ స్త్రీ వ్యసనం కుర్యాత్ స్త్రీ పుంసోర్వృష్టిరుచ్యతే । స్త్రీ నపుంసకయోర్వాయుః పురుషః పురుషశ్చ దాహకః ॥
ఆఖుశ్చ స్వల్ప వృష్టిశ్చ జంబుకే జలదాగమః । మండూకేऽత్యంత వృష్టిశ్చ ఖర మాహిష నిర్జలః ॥
అజశ్చ నిర్జలః ప్రోక్తః గజాశ్వశ్చ సుభిక్షకృత్ । మయూరశ్చ మహావాయురిత్యేతద్వర్ష లక్షణమ్ ॥
ఋక్షం భాను ప్రవేశఘటికా యాస్తద్దినం వారభం యుక్తం పంచదశేన షష్ఠగుణితం నాగాప్తశేషం తథా ।
వృష్టిశ్చాప్యతివృష్టి వహ్ని పవనాః వృష్టిశ్చ వృష్ట్యాగమః వృష్టిర్నాశముపైతి వృష్టి ఫలదం హ్యేవం విచింత్యేద్బుధః ॥

**తాత్పర్యము :** స్త్రీ స్త్రీ నక్షత్రములయిన వ్యసనం కలిగించును. స్త్రీ పురుష నక్షత్రములయిన వర్షము. స్త్రీ నపుంసకములయిన వాయువు. పురుష పురుష నక్షత్రములయిన ఎండ. ఆఖువు (ఎలుక) సుభిక్షం. మయూరం (నెమలి) మహావాయువు. జంబుకం (నక్క) మేఘావృతం, మండూకం (కప్ప) మిక్కిలివర్షం. ఖర (గార్ధభ – గాడిద), మహిషం (దున్నపోతు) జల రహితం. అజ (మేష– మేక) నిర్జలం. గజ (ఏనుగు) అశ్వం(గుఱ్ఱం) సుభిక్షం. కార్తె ప్రవేశకాల ఘటికలలో తత్కాల తిథి, వార, నక్షత్ర సంఖ్యలను కలిపి అందు 15 కలిపి 6 చే గుణించి 8చే భాగించగా శేషము 1,2,5,6,8 అయిన వర్షము, 3 అయిన ఎండ, 4 అయిన వాయువు. 7 అయిన వర్ష నాశనము.

# వర్షయోగవిచారః

**చైత్రము :** ఈ మాసమున రవి సౌమ్య, దహన నాడులయందు, కుజ బుధులు దహన నాడియందు, శుక్రుడు దహన, వాయు, మహావాయు నాడుల యందు సంచరించుదురు. కావున మాస పూర్వార్ధము కన్నా ఉత్తరార్ధమున గ్రీష్మాధిక్యము, వాతాధిక్యము పెరుగును. మాస ప్రారంభమున బుధ శుక్ర సమీప స్థితిచే వర్షించును. పిదప వర్షయోగము నష్టము.

**వైశాఖము :** ఈ మాసమున రవి వాయు, మహావాయు నాడులయందు, కుజుడు సౌమ్య, రస నాడుల యందు, బుధుడు సౌమ్య, దహన, వాయు నాడుల యందు, శుక్రుడు మహావాయు, వాయు, దహన నాడుల యందు సంచరించుదురు. పూర్వార్ధము కంటే ఉత్తరార్ధమున పశ్చిమవాతాధిక్యము, గ్రీష్మాధిక్యము కలుగును. మాస మధ్య ప్రాంతమున కుజ చలనం వలన వడగండ్ల వాన కొన్ని తావుల కలుగును.

**అధిక జ్యేష్ఠము :** ఈ మాసము నందు రవి, బుధుడు, మహావాయు, వాయు, దహన నాడుల యందు సంచరించుదురు. కావున గ్రీష్మాధిక్యము, పశ్చిమవాతాధిక్యము కొనసాగును. కుజుడు రస, జల నాడుల యందు, శుక్రుడు సౌమ్య, రస నాడుల యందు సంచరించుదురు. ఉత్తరార్ధమున ముఖ్యముగా మాసాంతమున శుక్రుని స్వనాడీ సంచారముచే తొలకరి వానలు కురియును.

**నిజ జ్యేష్ఠము :** ఈ మాసమున రవి దహన, సౌమ్య రస నాడుల యందు సంచరించుటచే పూర్వార్ధము కన్నా ఉత్తరార్ధమున వాతావరణము చల్లబడును. బుధుడు సౌమ్య, రస, జల, అమృత నాడుల యందు, శుక్రుడు జల, అమృత నాడుల యందు సంచరించుటచే బీజవాపానుకూలముగ వర్షించును. ఉత్తరార్ధమున బుధుని స్వనాడీ సంచారము 'ఫలమేకోఽపి సంధత్తే స్వనాడీ సంస్థితో గ్రహః' అనుటచే వర్షమునకు అత్యంత అనుకూలము.

**ఆషాఢము :** ఈ మాసమున రవి రస, జల, అమృత నాడులయందు, బుధుడు అమృత, జల నాడుల యందు, శుక్రుడు జల, రస నాడుల యందు సంచరించుదురు. కావున సస్యానుకూల వృష్టి మాసమంతయూ కలుగును. మాస ఉత్తరార్ధమున శుక్రుడు, మాసాంతమున బుధుడు స్వనాడి యందు సంచరించు చున్నందున ఉత్తరార్ధమున సస్యానుకూల వృష్టి తప్పక కలుగును.

**శ్రావణము :** ఈ మాసమున రవి అమృత, జల నాడుల యందు, బుధుడు అమృత నాడి యందు, శుక్రుడు సౌమ్య, దహన నాడుల యందు సంచరించుదురు. కావున పూర్వార్ధమున కొంత మేరకు వర్షించును. ఉత్తరార్ధమున వర్షము మధ్యమము.

**భాద్రపదము :** ఈ మాసమున రవి జల, రస, సౌమ్య నాడుల యందు, శుక్రుడు వాయు నాడి యందు, బుధుడు జల, రస, దహన నాడుల యందు సంచరించుదురు. మాస పూర్వార్ధమున బుధుని స్వనాడీ సంచారముచే వాయు సహిత వృష్టి కలుగును.

**ఆశ్వయుజము :** ఈ మాసమున రవి దహన, వాయు నాడులయందు , బుధుడు వాయు, మహావాయు నాడులయందు, శుక్రుడు వాయు, దహన నాడులయందు సంచరించుదురు. మరియు మాస ప్రారంభమున బుధ శుక్ర సమీప స్థితి వలన, ఉత్తరార్ధమున శుక్రోదయము వలన వాయు సహిత వృష్టి కలుగును. మాసాంతమున కుజ చలనం వలన వర్షించును.

**కార్తికము :** ఈ మాసమున రవి మహావాయు నాడియందు, బుధుడు, వాయు, మహావాయు నాడులయందు, శుక్రుడు దహన నాడియందు సంచరించుదురు. కావున వర్షమునకవకాశము తక్కువ. పూర్వార్ధమున గుర్వస్తమయము వలన తప్పక వాయుసహిత వృష్టి కలుగును.

| లగ్నము | ప్రమాణము | పుష్కరము | లగ్నము | ప్రమాణము | పుష్కరము |
|---|---|---|---|---|---|
| మేషం | ౪.౨ | ౨.౪౯ | తుల | ౫.౧౪ | ౪.౧౧ |
| వృషభం | ౪.౩౦ | ౨.౬ | వృశ్చికం | ౫.౨౭ | ౧.౧౬ |
| మిథునం | ౫.౧౧ | ౪.౯ | ధనుస్సు | ౫.౩౫ | ౩.౫౪ |
| కర్కటకం | ౫.౩౫ | ౧.౧౭ | మకరం | ౫.౧౧ | ౨.౨౫ |
| సింహం | ౫.౨౭ | ౩.౪౬ | కుంభం | ౪.౩౦ | ౩.౩౬ |
| కన్య | ౫.౧౪ | ౨.౫౬ | మీనం | ౪.౨ | ౦.౫౬ |

## విజయదశమీ నిర్ణయః

అస్మిన్నబ్దే ఆశ్వయుజ శుక్ల ౯ గురు ౧౯.౨౨ శ్రవణా ౪౪.౫౦, పరేద్యుః ౧౦ శుక్ర ౨౪.౩౬. అత్ర గురువాసర ఏవ విజయదశమీ కార్యా, న భార్గవవాసరే, దినద్వయే అపరాహ్ణ వ్యాప్తి సత్త్వేఽపి గురువాసరే ప్రదోషవ్యాప్తేరాధిక్యాత్, శ్రవణ సంబంధ సత్త్వాత్, "దినద్వయేఽపరాహ్ణ వ్యాప్తౌ పూర్వా" ఇతి నిర్ణయ సింధు కారోక్తేః, 'దినద్వయేఽపరాహ్ణ వ్యాప్తౌ దినద్వయే శ్రవణా యోగే సత్యసతి వా పూర్వా' ఇతి ధర్మసింధుకారోక్తేశ్చ. రాజ్ఞాం పట్టాభిషేచనే తు ఏకాదశీ యుక్త దశమ్యా గ్రాహ్యత్వాత్ భృగువాసర ఏవ గ్రాహ్యః, 'రాజ్ఞాం పట్టాభిషేకే నవమీ విద్ధా దశమీ శ్రవణయుతాఽపి న గ్రాహ్యా, కిం త్వేకాదశ్యైవ గ్రాహ్యా' ఇతి ధర్మసింధుసారకారోక్తేః. ప్రమాణ వచనాని తు జ్యోతిర్నిబంధే -

శ్లో॥ నవమ్యా సహితా కార్యా దశమ్యాశ్వయుజ స్థితా ।
ఏకాదశ్యా యుతా జాతు న కార్యా జయ కాంక్షిభిః ॥

ఇషస్య దశమీం శుక్లాం పూర్వవిద్ధాం న కారయేత్ ।
శ్రవణేనాపి సంయుక్తాం రాజ్ఞాం పట్టాభిషేచనే' ॥ ఇత్యాదీని.

**మహానవమీ తు పూజాదౌ సౌమ్యవాసరే, బలిహోమాదౌ తు గురువాసర ఏవ.**

శ్లో॥ ఆశ్వినస్య సితే పక్షే నవమీ యాఽష్టమీయుతా ।
సా గ్రాహ్యా పూజనే దేవ్యాః హోమాదౌ తు పరాన్వితా ॥ ఇతి

# ఉత్తరాయణ పుణ్యకాల నిర్ణయః

అస్మిన్ వర్షే పుష్య శుక్ల ౮ సోమవాసరే మకరేఽర్కః ౪౬.౪౪. అత్ర భౌమవాసర ఉదయే ఉత్తరాయణ పుణ్యకాలః. ధర్మసింధు సారే "రాత్రౌ పూర్వభాగే పరభాగే నిశీథే వా మకర సంక్రమే ఉత్తర దినం పుణ్యం, తత్రాప్యుత్తర దిన పూర్వార్ధం పుణ్యతరం, తత్రాపి సూర్యోదయోత్తరం పంచనాడ్యః పుణ్యతమాః" ఇత్యుక్తమ్.

# మరియొక ధర్మ మీమాంస

భాద్రపద శుక్ల తృతీయ యందు షోడశోమా వ్రతమను గౌరీ వ్రతము కలదు. భాద్రపద బహుళ తృతీయయందు బృహద్గౌరీ వ్రతమనియూ, బృహత్యుమా వ్రతమనియు అనబడు గౌరీవ్రతము కలదు. దీనిని ఉండ్రాళ్ళతద్దె అనియందురు. ఇటులనే ఆశ్వయుజ బహుళ తృతీయయందు చంద్రోదయోమా వ్రతమను గౌరీవ్రతము కలదు. దీనిని అట్లతద్దెయందురు. ఈ షోడశోమా, బృహత్యుమా, చంద్రోదయోమా వ్రతములు మూడును ద్వితీయా సంబంధము ఏమాత్రము లేని తృతీయయందు ఆచరించదగినవి. "చతుర్థి గణపతి తిథి". "తృతీయ గౌరీ తిథి" గనుక చతుర్థీయుక్త తృతీయనాడే గౌరీ వ్రతములు ఈ 3 ఆచరణీయములు. మా ప్రాచీనులు చంద్రోదయ కాలమునకు తృతీయయున్నను, ద్వితీయాయుక్త తృతీయను వదలి చతుర్థీయుక్త తృతీయయందే బృహత్యుమా, చంద్రోదయోమా వ్రతములు వ్రాసెడివారు గనుక, మేము కూడా అట్లే వ్రాయుచుంటిమి. ఇందలి వాస్తవమును విజ్ఞులు గ్రహించగలరని భావించి ఈ క్రింద నిర్ణయము వ్రాయుచున్నాము. పండితులు పరిశీలించ ప్రార్థితులు.

# బృహత్యుమా వ్రత నిర్ణయః (ఉండ్రాళ్ళ తద్దె)

"భాద్రపద బహుళ ౨ గురువాసరః ౫.౨౩ భాద్రపద బహుళ ౩ భార్గవవాసరః ౪.౪౪"

**అత్ర భార్గవవాసరే బృహత్యుమావ్రతం కార్యమ్**

అస్య వ్రతస్య చంద్రోదయకాల కర్తవ్యత్వాత్ తృతీయాయాః గురువాసరే ఏవ చంద్రోదయవ్యాప్తేః, గురువాసరే ఏవ బృహత్యుమావ్రతం కర్తవ్యమితి కేచిద్వదంతి. తదసత్. బృహన్నారదీయే

శ్లో॥ ఏకాదశ్యష్టమీ షష్ఠీ పౌర్ణమాసీ చతుర్దశీ ।
అమావాస్యా తృతీయా చ వ్రతాదిషు మునీశ్వరాః ॥
పరవిద్ధాః ప్రశస్తాస్స్యుర్న కార్యాః పూర్వసంయుతాః ।
ఇత్యుక్తేః ద్వితీయాయుక్త తృతీయాయాః నిషిద్ధత్వాత్ ॥

యుగ్మాగ్ని వాక్యస్య చ రంభావ్రతమాత్ర పరత్వేన నిర్ణీతత్వాత్,

శ్లో॥ చతుర్థీసహితా యా చ సా తృతీయా ఫలప్రదా ।
అవైధవ్యకరీ స్త్రీణాం పుత్ర సౌభాగ్యదాయినీ ॥
ఇతి ఆపస్తంబోక్తేశ్చ. బ్రహ్మవైవర్తే -

శ్లో॥ "రంభాభ్యాం వర్జయిత్వా తు తృతీయాం ద్విజసత్తమ ।
అన్యేషు వ్రత కార్యేషు గణయుక్తా ప్రశస్యతే" ॥

ఇతి స్పష్టముక్తత్వాత్. కించ ద్వితీయా సహిత తృతీయాయాస్త్యాజ్యత్వం స్పష్టం ప్రతిపాద్యతే స్కాందే

శ్లో॥ కళా కాష్ఠాఽపి వా చైవ ద్వితీయా సంప్రదృశ్యతే ।
సా తృతీయా న కర్తవ్యా కర్తవ్యా గణసంయుతా ॥
ఆద్యా మధు శ్రావణికా కజ్జలీ హరితాళికా ।
చతుర్థీ మిశ్రితా స్త్రీభిర్దివానక్తే విధీయతే ॥
సా తృతీయా న కర్తవ్యా ద్వితీయా సంయుతా తిథిః ।
యా కరోతి విమూఢా స్త్రీ పురుషో వా శిఖిధ్వజ ॥

ద్వితీయయా యుతం తాత యః కరోతి నరాధమః ।
సంవత్సర కృతేనైవ నరో ధర్మేణ ముచ్యతే ॥
ద్వితీయా సంయుతా తాత పూర్వధర్మాద్విలుప్యతే ।
విధవాత్వం దుర్భగాత్వం భవేన్నాస్త్యత్ర సంశయః ॥

అతః సభర్తృకా 'భాద్రమాస్యసితే పక్షే తృతీయాయాం విధూదయే, సుస్నాతా వాగ్యతా నారీ బృహద్గౌరీం సమర్చయేత్'

ఇత్యాదీని తృతీయాయాః చంద్రోదయ కాల సద్భావబోధకాని సర్వాణి 'ద్వితీయా సంబంధ రహిత, కేవల తృతీయా పరాణి' ఇత్యవధేయమ్. కించ భవిష్యే-

శ్లో॥ తృతీయాం గణసంయుక్తాం యా కరోతి వ్రతాదిషు ।
సా పుత్ర పౌత్ర సంపద్భిః మోదతే శివమందిరే ॥
గౌరీ వినాయకోపేతా, రోహిణీ బుధ సంయుతా ।
వినాఽపి రోహిణీ యోగాత్పుణ్య కోటి ఫలప్రదా ॥
(గౌరీ తృతీయా వినాయకశ్చతుర్థీ)

ఇత్యాద్యనేక వచనాని, భృగువాసరే చంద్రోదయ కాలే తృతీయాయాః అసత్త్వేఽపి గౌరీవ్రత కర్తవ్యతాం బోధయంతి. "నను సర్వమిదమసంగతమ్ వ్రతాచరణ కాలే తృతీయాయా అభావాత్ అతఃపూర్వం గురువాసరే చంద్రోదయ కాలే తృతీయాయాః సత్త్వాత్, తిథి ప్రాధాన్యస్య 'తిథిశ్శరీరం తిథిరేవ కారణం'. ఇత్యాది బహువచనైస్సిద్ధత్వాత్, గురువాసరే చంద్రోదయ కాల ఏవైతద్వ్రతం కార్యమి"తిచేదత్రోచ్యతే-

శ్లో॥ ఆదిత్యోదయ వేళాయాం యాఽల్పాఽపి చ తిథిర్భవేత్ ।
పూర్ణా ఇత్యేవ మంతవ్యా ప్రభూతా నోదయం వినా ॥

ఇతి వచనాత్ ఉదయ కాల వర్తిన్యాస్తిథేః పూర్ణత్వేనైవ మంతవ్యత్వాత్. 'సందిగ్ధే తు వాక్యశేషాత్' ఇతి హి న్యాయః.

శ్లో॥ త్రివిధా చ తృతీయా చ షష్ఠీ చైవ త్రయోదశీ ।
పూర్వ విద్ధా తు కర్తవ్యా యది న స్యాత్పరేఽహని ॥

ఇతి వచనస్యానపలపనీయత్వాత్, 'యది న స్యాత్పరేఽహని' ఇతి వాక్య శేషాత్, త్రివిధాయాః తృతీయాయాః షోడశోమా, బృహత్యుమా చంద్రోదయో మారూపాయాః పరేద్యుః సూర్యోదయాత్ప్రాగేవ సమాప్తావేవ పూర్వవిద్ధాయాః స్వీకార్యత్వ ప్రతీతేః. అతః 'యదా ద్వితీయా ప్రాతః త్రిముహూర్తాల్పా తృతీయా చ తస్మిన్నేవ దినే క్షయవశాత్సమాయాతి, తదైవ ద్వితీయాయుక్త తృతీయాయా గ్రాహ్యత్వం నాన్యత్రే'తి సిధ్యతి. ఏతద్బోధకమేవ, 'బృహద్గౌరీ వ్రతే కార్యా తృతీయా భద్రదాయుతా' ఇతి వచనమపీతి జ్ఞేయమ్. యత్తు

శ్లో॥ చంద్రోదయే, యదా రాజన్ తృతీయా వర్తతేఽసితే ।
తస్యామేవ నరస్సమ్యగ్బృహద్గౌరీం సమర్చయేత్ ॥

ఇతి వచనం తత్, సమ్యఙ్నిర్ణీతమ్. అర్థాత్ 'అవిద్ధా ద్వితీయయా యదా యస్మిన్ దినే తృతీయా వర్తతే, తస్మిన్ దినే బృహద్గౌరీం సమర్చయేది'తి వ్యాఖ్యేయం, ప్రథమారంభ పరం వా, ప్రథమారంభే వ్రతానామఖండ తిథేరేవాపేక్షి తత్వాత్. అన్యథా దినద్వయే ప్రదోషవ్యాప్తౌ సత్యామసత్యామపి పరవిద్ధాయాః ఏవ గ్రాహ్యత్వ బోధక బహువచన విరోధాదితి శమ్.

## అథ అలభ్య యోగాః కతిచన లిఖ్యంతే

**1)** అస్మిన్నబ్దే చైత్ర పూర్ణిమా స్నానదానజపాదిషు **మహా పుణ్యప్రదా.**

శ్లో॥ మందే వాఽర్కే గురౌ వాఽపి వారేష్వేతేషు చైత్రికా ।
తత్రాశ్వ మేధజం పుణ్యం స్నానశ్రాద్ధాదిభిః భవేత్ ॥

**2)** అస్మిన్నబ్దే అధిక జ్యేష్ఠ శుక్ల చతుర్థీ **మహా చతుర్థీ.**

శ్లో॥ చతుర్థీ జ్యేష్ఠ శుక్లే చేత్ శంకరర్క్ష సమన్వితా ।
మహతీ కీర్తితా తస్యాముమాముద్దిశ్య భక్తితః ॥
స్నానం దానం తథా పూజా బ్రాహ్మణారాధనం తథా ।
క్రియమాణం శతగుణం భవత్యేవ న సంశయః ॥ ఇతి

**3)** అస్మిన్నబ్దే కార్తిక శుక్ల షష్ఠీ **మహా షష్ఠీ.**

శ్లో॥ వృశ్చికార్కే శుక్ల షష్ఠీ భౌమవారేణ సంయుతా ।
'మహాషష్ఠీ'తి సా ప్రోక్తా సర్వపాప హరా తిథిః ॥
తస్యాం స్వపితి వై వహ్నిః పూర్వత్రోపోష్య వై దినే ।
తస్యాం వహ్నిం సమభ్యర్చ్య కుర్యాద్వహ్ని మహోత్సవమ్ ॥ ఇతి
"వృశ్చికార్కే కార్తిక మాస ఇత్యర్థః "

**4)** అస్మిన్నబ్దే కార్తిక శుక్ల ఏకాదశీ **అనన్తైకాదశీ.**

శ్లో॥ ఏకాదశీ సోమయుతా కార్తికే మాసి భామిని ।
ఉత్తరాభాద్రయా యుక్తా హ్యనన్తా సా ప్రకీర్తితా ॥
తస్యాం యత్క్రియతే భద్రే సర్వమానంత్యమశ్నుతే ॥

**5)** అస్మిన్నబ్దే పుష్య అమావాస్యా సోమవాసరః **మహోదయ యోగః.**
సేతౌ అన్యత్ర వా సముద్రస్నానం.

శ్లో॥ అర్క శ్రోణా వ్యతీపాత యుక్తాఽమా పౌషమాఘయోః ।
అర్ధోదయస్సవిజ్ఞేయః కించిన్న్యూనో మహోదయః ॥
కించిన్న్యూనస్సోమవార యుక్తశ్చేదిత్యర్థః ॥

# అథ మలమాసే కార్యాకార్య నిర్ణయః

**వైద్యనాథ దీక్షితీయే -**

శ్లో॥ ద్వౌ మాసావేక నామానావేకస్మిన్నేవ వత్సరే ।
ఉత్తరే దేవకార్యాణి పితృకార్యాణి చోభయోః ॥

**వ్యాసోఽపి** శ్లో॥ షష్టిభిర్దివసైర్మాసః కథితో బాదరాయణైః ।
ఉత్తరే దేవ కార్యాణి పితృకార్యాణి చోభయోః ॥

శ్లో॥ అన్యమాస ప్రమీతానామధిమాస సమాగమే ।
ఏకనామ్నా తు కర్తవ్యం మాసిక ద్వయమీరితం ॥

**అన్యమాసోనామ అధిమాస వ్యతిరిక్త మాస ఇత్యర్థః.**

శ్లో॥ అగ్న్యాధేయం పుంసవనం యజ్ఞదాన వ్రతాని చ ।
దేవవ్రత వృషోత్సర్గ చూడాకరణమేఖలాః ॥

శ్లో॥ గమనం దేవతీర్థానాం వివాహమభిషేచనం ।
యానంచ గృహ కర్మాణి మలమాసే వివర్జయేత్ ॥

**కించ** శ్లో॥ అవశ్య కర్మ మాసాఖ్యం మలమాస మృతాబ్దికం ।
తీర్థేభచ్ఛాయయోశ్శ్రాద్ధం మఘానంగ పితృక్రియాం ॥

శ్లో॥ కుర్యాన్మలిమ్లుచే మాసి మద్యేచేత్సుతదాదికం ।
ప్రేతక్రియాం సమాస్యత్ర కుర్వీతాభ్యుదయకం తథా ॥

**ధర్మప్రవృత్తౌ** శ్లో॥ 'ప్రత్యబ్దమధికేఽపి స్యాదర్ఘ్య పిండవివర్జితం ।
పిండార్ఘ్య సహితం శుద్ధే కుర్యాది'త్యాహ కాశ్యపః ॥

**యల్లాజీయే -** శ్లో॥ గర్భే వార్ధుషికే భృత్యే శ్రాద్ధ కర్మణి మాసికే ।
సపిండీకరణే నిత్యే నాధిమాసం తు వర్జయేత్ ॥

**దీపికాయాం -** శ్లో॥ తీర్థశ్రాద్ధం జపోహోమో యవ వ్రీహి జలాదిభిః ।
జాతకర్మాది కార్యాణి నవశ్రాద్ధాని యాని చ ॥

శ్లో॥ మఘాత్రయోదశీశ్రాద్ధం శ్రాద్ధాన్యపి చ షోడశ ।
మలమాసేఽపి కార్యాణి నిత్యనైమిత్తికం తథా ॥

శ్లో॥ దహనోదక పిండాశ్చ సంచయశ్శ్రాద్ధ కర్మ చ ।
దర్శశ్రాద్ధం నిత్యహోమం మలమాసేఽపి కారయేత్ ॥

**అత్ర-** శ్లో॥ స్వర్గకామో వృషోత్సర్గం మలమాసే వివర్జయేత్ ।
ఏకాదశాహ్నికం యత్తు మలమాసేఽపి తత్కృతమ్ ॥

శ్లో॥ అతీత ప్రేత కార్యం చ అతీతోత్సవమేవ చ ।
శుద్ధమాసే హి కర్తవ్యం న కార్యం తు మలిమ్లుచే ॥

శ్లో॥ మలిమ్లుచే మాసి మృతస్య పుంసః త్రయోదశే తు ప్రథమాబ్దికం స్యాత్ ।
మధ్యేఽధిమాసే తు పునస్తథైవ అంత్యేఽధికే ద్వాదశ మాస ఏవ ॥

శ్లో॥ మధ్యేఽధిమాసే సంప్రాప్తే కథమూనాబ్దికం భవేత్ ? ।
మామలేనైవ కుర్వీత మాదలే తు సమాపయేత్ ॥

మలమాస మృతానాం తు ద్వాదశాహ సపిండనే ఆద్యమాసికమపి పునర్నిజమాసఏవ కార్యమ్. తథా చ దక్షః

శ్లో॥ ఆవృత్తిశ్చాన్య మాసానాం ద్వాదశాహ సపిండనే ।
తథా నావర్తయేదాద్యం మలే త్వావృత్తిరిష్యతే ॥

శ్లో॥ శ్రాద్ధేఽహని చ సంప్రాప్తే అధిమాసోయదా భవేత్ ।
మాసద్వయేఽపి కుర్వీత శ్రాద్ధమేవం న దూష్యతే ॥

శ్లో॥ ఆబ్దికం ప్రథమం యత్స్యాత్తత్కుర్వీత మలిమ్లుచే ।
త్రయోదశే తు సంప్రాప్తే కుర్వీత ప్రథమాబ్దికమ్ ॥

**పునరాబ్దికం పురాణప్రత్యాబ్దికం ప్రత్యాబ్దికం శుద్ధమాస ఏవకుర్యాదిత్యర్థః కించ**

శ్లో॥ శుద్ధమాసమృతానాంతు మృతమాసోఽధికో భవేత్ ।
అన్యాని చోత్తరే కుర్యాత్ప్రథమం త్వధికే చరేత్ ॥

శ్లో॥ మలమాస మృతానాం తు యచ్ఛ్రాద్ధం ప్రతివత్సరం ।
మలమాసేఽపి కర్తవ్యం నాన్యేషాం తు కదాచన ॥

త్రైపక్షికోనమాసిక విషయే పితృమేధసారే – 'తత్తన్మాస వృద్ధౌ త్రైపక్షిక మూనానిచ పూర్వత్రైవ, న పరత్ర పునః కుర్యాత్'. సుధీవిలోచనే వ్యాఖ్యాతమేతత్ – 'ద్వితీయ మాసవృద్ధౌ మృతాహాత్త్రిపక్ష ఏవ త్రైపక్షికం కుర్యాన్నచ పరత్ర మాసేఽత్రి పక్షత్వాత్. ఏవం షష్ఠ మాసవృద్ధౌ ఊనషాణ్మాసికం షష్ఠమాస ఏవ కుర్యాన్న పరమాసే, తస్య సప్తమత్వాత్. ఏవం ద్వాదశమాసవృద్ధౌ ఊనాబ్దికం ద్వాదశే మాస ఏవ కుర్యాన్న త్రయోదశ మాసే' ఇతి. అన్యే తు "షష్టిభిర్దివసైః" ఇతి షష్టి దినానామేకమాసత్వ స్మరణేన ఉత్తరమాసానామపి ఆద్యషష్ఠద్వాదశ మాసత్వాద్ధిత్రిదినైరూనేషు తేషూనానాం కరణ సంభవాత్.



## ఋణ విమోచన శ్రీలక్ష్మీనృసింహ స్తోత్రము

శ్లో॥ దేవకార్యార్థ సిద్ధ్యర్థం సభాస్తంభ సముద్భవమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౧

శ్లో॥ లక్ష్మ్యాలింగిత వామాఙ్గం భక్తానాం వరదాయకం ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౨

శ్లో॥ అంత్రమాలాధరం శంఖచక్రాద్యాయుధ ధారిణం ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౩

శ్లో॥ స్మరణాత్సర్వపాపఘ్నం కద్రూజవిషనాశనం ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౪

శ్లో॥ సింహనాదేన మహతా దిగ్దంతి భయనాశనమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౫

శ్లో॥ ప్రహ్లాదవరదం శ్రీశం దైత్యేశ్వర విదారణమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౬

శ్లో॥ క్రూరగ్రహైః పీడితానాం భక్తానామభయప్రదం ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౭

శ్లో॥ వేదవేదాంత యజ్ఞేశం బ్రహ్మరుద్రాది వందితం।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౮

శ్లో॥ య ఇదం పఠతే నిత్యం ఋణమోచన సంజ్ఞితం ।
అనృణీ జాయతే సద్యః ధనం శీఘ్రమవాప్నుయాత్ ॥ ౯

సద్భక్తిభావముతో నియమబద్ధముగా దీనిని పఠించువారలకు
శ్రీలక్ష్మీనృసింహ కటాక్షమున ఋణవిమోచన మార్గము లభించును.

# గోచారములు

## మేషరాశి

### అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదము

### (చూ,చే, చో, ల, లీ, లూ, లే, లో, ఆ)

### ఆదాయం : 2, వ్యయం : 14 - రాజపూజ్యం : 5, అవమానం : 7

వీరికి ఈ సంవత్సరమంతయు భాగ్యశనియగుటచే శుభకార్య విఘ్నము, పితృ లేదా సదృశ వ్యక్తికి తీరని కష్టము, మనో వ్యాకులతయుండును. కళత్ర, పుత్రమూలక వ్యథ, ఒకప్పుడు ధనలాభము, శుభము కలుగును. భాద్రపద బహుళము వరకు సప్తమ శనియగుటచే గృహమున శాంతిసౌఖ్యములు ఏర్పడును. కళత్రవర్గ అనుకూలతయుండును. ఆరోగ్యము, రాజదర్శనము, ఇష్టకార్య సిద్ధి కలుగును. పిదప ఫాల్గున శుక్లము వరకు అష్టమ గురువు అగుటచే కొంత ఇబ్బందిగనుండును. అపనిందలు, భయము, గౌరవహాని కలుగును. చోరాగ్ని రాజ బాధలు కలుగును. శరీర పటుత్వము తగ్గును. గాంభీర్యము లోపించును. సంవత్సరారంభము నుండి మాఘ బహుళము వరకు చతుర్థ రాహువు, దశమ కేతువు అయినందున వృత్తి ఉద్యోగ వ్యాపారాదులయందు అశాంతి అధికముగనుండును. గృహమందు అశాంతి, మాతృవర్గ బంధు జనముతో అభిప్రాయ భేదములు, చిత్త చాంచల్యము ప్రయాణాదులయందు విఘ్నములు, వాతరోగములు కలుగును. మధ్య మధ్య సుఖము, ఇష్టభోజనము శరీరదార్ఢ్యము కలుగును.

**చైత్రమున** ధనవ్యయము, ఆపదలు, రోగములు, ఆహార విహారములయందు జాగ్రత్తగనుండవలయును. కలహములు గాయములు బాధించును. ఉత్తరార్ధమున బాగుండును. ధనప్రాప్తి సౌఖ్యము కలుగును. **వైశాఖమున** శుభాశుభ మిశ్రమముగనుండును. మిత్రులతో, బంధువులతో వైరములు కలుగును. ఉద్యోగమునందు శ్రమ ఉన్ననూ కుటుంబ సభ్యుల సహకారమున అంతిమముగా సుఖముగనేయుండును. **అధిక జ్యేష్ఠమున** దుష్ట స్నేహము వలన కష్టములు, ధనవ్యయమునకవకాశము ఎక్కువ. జాగ్రత్తగనుండినచో మంచిది. సజ్జన సాంగత్యము వలన ఉపయోగము. ధనలాభము కలుగును. **నిజ జ్యేష్ఠమున** శారీరక స్వాస్థత కలుగును. మనస్సుకు ఉల్లాసము, బంధుమిత్రులచే లాభము, నూతన ప్రారంభములు అనుకూలించును. మొత్తము మీద మాసమంతయూ లాభకరముగనుండును. **ఆషాఢమున** ప్రయాణాదులయందు జాగ్రత్త అవసరము. చాలా వరకు అనుకూలముగనుండును. స్వంత బుద్ధి చేత కార్య నిర్ణయము చేయుటచే లాభించును. ఉత్తరార్ధమున గృహమందు భార్యాపుత్రాది స్వజనులతో అభిప్రాయ భేదములు కలుగవచ్చును. **శ్రావణమున** శారీరక, మానసిక శ్రమ, అలసటయు, అందుచే అనాలోచిత నిర్ణయములు అందుచే స్వజన విరోధము కలుగును. ఆరోగ్య లోపములు అశ్రద్ధ చేయరాదు. **భాద్రపదమున** చాలా వరకు పరిస్థితులు అనుకూలముగనేయుండును. సన్మానము, విజయము కలుగును.

ధన, ధాన్య లాభము, ధైర్యము కలుగును. పూర్వార్ధము కన్నా ఉత్తరార్ధము మరింత మేలుగనుండును. **ఆశ్వయుజమున** వ్యాజ్యమునకవకాశమధికము. ఇరుగుపొరుగు భాగస్వామ్యము కలిగిన వారితో సామరస్యముగనుండవలయును. కళత్రపీడయు, ఉత్సాహభంగము కలుగును. **కార్తికమున** అనేక సమస్యలు ఉన్ననూ, అంతిమముగా విజయము లభించును. ధైర్యము సమకూరును. ఆరోగ్య, ద్రవ్యలాభము కలుగును. ప్రయాణాదులయందు జాగ్రత్త అవసరము. **మార్గశిరమునందు** అపరాధము లేక నిందలు మోయవలసియుండును. కావున కార్యములయందు జాగ్రత్త అవసరము. పూర్వార్ధమున లాభము జయము. ఉత్తరార్ధమున కొంత శ్రమ అధికముగనుండును. **పుష్యమాసమున** సల్ప వివాదములు, అనవసర వ్యయములు ఉన్నను అధికముగ లాభము జయము కలుగును. పుణ్యకార్యములయందు ఆసక్తి కలుగును. **మాఘ మాసమున** శుభకార్యముల కొరకు చేయు ప్రయత్నములు కలిసి వస్తాయి. ధనలాభము కలుగును. కీర్తి, బంధువులతో అనుకూలత కలుగును. కఠినమైన రంగములయందు పనిచేయువారు జాగ్రత్తగానుండగలరు. **ఫాల్గునమున** పూర్వార్ధమున కొన్ని రంగములయందు జయము, ప్రోత్సాహము ఉన్నను కొంత ఇబ్బందియు అధికముగనుండును. శారీరక శ్రమ అధికము. ఉత్తరార్ధమున తిరిగి సౌఖ్యము, జయము కలుగును.

**అశ్విని** వారికి అధిక జ్యేష్ఠ బహుళము నుండి కార్తిక బహుళము వరకు జన్మతారయందు శని, పుష్యశుక్లము నుండి సంవత్సరాంతము వరకు నైధనతారయందు రాహువు సంచరించును. మాఘ శుక్లమునందు జన్మ నక్షత్రమందు కుజ సంచారము. **భరణీ** నక్షత్రము వారికి అధిక జ్యేష్ఠ బహుళము వరకు తిరిగి కార్తిక బహుళము నుండి సంవత్సరాంతము వరకు జన్మతారయందు శని, వైశాఖ బహుళము నుండి మార్గశిర బహుళము వరకు నైధనతార యందు రాహువు, మాఘ బహుళమునందు జన్మ నక్షత్రమందు కుజుడు సంచరించును. **కృత్తిక** వారికి వైశాఖ శుక్లము వరకు నైధనతార యందు రాహువు, శ్రావణ బహుళం నుండి సంవత్సరాంతము వరకు జన్మతార యందు కేతువు, సంవత్సరాంత పక్షమున జన్మనక్షత్రమందు కుజుడు, ఆషాఢ బహుళము నుండి భాద్రపద శుక్లము వరకు, వైశాఖ బహుళము, అధిక జ్యేష్ఠ శుక్లమునందు జన్మతారయందు కుజుడు సంచరించును. శ్రావణ బహుళము వరకు కృత్తిక వారికి సప్తశలాక కేతువేధ. అధిక జ్యేష్ఠ బహుళము నుండి ఆషాఢ శుక్లము వరకు మరియు భాద్రపద బహుళము నుండి ఆశ్వయుజ శుక్లము వరకు కుజవేధ కావున ఆయా రాశుల వారు ఆయా సమయములయందు కొంత జాగ్రత్తగనుండి సాహసకృత్యములు మానవలయును. ఆయా గ్రహములకు శాంతియొనర్చవలయును. శని, రాహు, కేతువులకు, ఉత్తరార్ధమున గురు, కుజులకు శాంతి యొనర్చిన మేలు. హనుమత్పూజా ప్రదక్షిణములు, దుర్గాసప్తశతి పారాయణము వలన గ్రహదోషములు తొలగగలవు.

# వృషభ రాశి

## కృత్తిక 2,3,4పాదములు, రోహిణి, మృగశిర 1,2పాదములు
## (ఈ, ఊ, ఏ, ఓ, వా, వీ, వూ, వే, వో)
## ఆదాయం : 11, వ్యయం : 5 - రాజపూజ్యం : 1, అవమానం : 3

వీరికి ఈ సంవత్సమంతయు అష్టమశనియగుటచే మిక్కిలి శ్రమకరముగ నుండును. ప్రయత్నించినను కార్యములు సానుకూలపడవు. ధనవ్యయమగును. ప్రమాదములు, అపనిందలు, గౌరవహాని కలుగును. భాద్రపద బహుళము వరకు షష్ఠ గురువు అయినందున శత్రుజ్ఞాతి బాధలు, వ్యాజ్యములు, చోర రోగ బాధలు అధికముగనుండగలవు. భార్యాపుత్ర బంధు విరోధము ఒకప్పుడు కలుగును. పిదప ఆశ్వయుజ శుక్లము నుండి సప్తమ గురువు అయినందున ఆరోగ్యము, రాజదర్శనము, ఇష్టకార్యసిద్ధి కలుగును. గృహమున శాంతి సౌఖ్యములు కలుగును. కళత్రవర్గ అనుకూలత ఏర్పడును. మాఘ బహుళము వరకు తృతీయ రాహువు, భాగ్యకేతువు అయినందున పరిస్థితులు అనుకూలించుటయు, తలచిన కార్యములు నెరవేరుటయు జరుగును. చాలావరకు శుభప్రదముగనేయుండును. అయితే భ్రాతృద్వేషము, మర్యాదహాని, పశు సంపద నష్టము, పంటనష్టము కూడా అపుడపుడు జరుగగలవు. ఫాల్గునమందు ద్వితీయరాహువు, అష్టమకేతువు కావున వృథా వైరములు, వృథా వ్యయములు చతుష్పాజ్జంతువుల పీడ కలుగును. ఫాల్గునమున అష్టమగురువు కూడా అయినందున కొంచెము జాగ్రత్త అవసరము.

**చైత్రమున** అనేక ఇబ్బందులున్నను తలచిన కార్యములు నెరవేరును. శుభకార్యములకు చేయు ప్రయత్నములు నెరవేరును. విందు వినోదములు సమకూరును. కీర్తి ప్రతిష్ఠలు కలుగును. ఉత్తరార్ధమున కొంత శ్రమకరము. **వైశాఖమున** ద్రవ్యలాభము, మనఃసౌఖ్యము, యత్న కార్యసిద్ధి వలన ఉత్సాహము కలుగును. ఉత్తరార్ధమున స్థానచలనము, దూరప్రయాణములయందు ఇబ్బందులు కలుగును. **అధిక జ్యేష్ఠమున** శారీరక బాధ, బందుమిత్ర విరోధము, అకాల భోజనములు, అందుచే ఆరోగ్య లోపములు కలుగును. మధ్యమధ్య కొన్ని విషయముల యందు అనుకూలతయుండును. వివాహాది శుభకార్యములకు చేయు ప్రయత్నములు కలసి వచ్చుట, తన్మూలక ధనవ్యయము కలుగును. **నిజ జ్యేష్ఠమున** సహవాస దోషములు బాధించును. అందుచే ధనవ్యయము కలుగును. ఉత్తరోత్తరా శుభకార్యానుకూలతయుండును. వర్తక వ్యవసాయములందు మిశ్రమముగ నుండును. **ఆషాఢమున** చాలావరకు అనుకూలముగనుండును. అధికముగ శుభ ఫలములు కలుగును. భూగృహ సంపాదనకు అనువగు కాలము. నూతన పరిచయములు లాభించును. గౌరవ మర్యాదలు కలుగును. **శ్రావణమున** పూర్వార్ధము చాలా వరకు ఆనందముగ గడచును. నూతన ప్రయత్నములు కలసి వస్తాయి. ఉత్తరార్ధమున గృహచ్ఛిద్రములు, అశాంతి అధికముగనుండును. **భాద్రపదమున** శారీరక మానసిక దౌర్బల్యము, మిత్రుల మూలకముగా కష్టము, మనస్సు స్థిమితము తక్కువగనుండును. ఉష్ణతాపము కలుగును. భార్యాపుత్రాది స్వజన విరోధము

కలుగును. ఉత్తరార్థమున కొంత ఉపశమనముగనుండగలదు. **ఆశ్వయుజమున** చాలా వరకు సమస్యలు తొలగును. ధనలాభము, వస్త్రలాభము, విద్యాలాభము కలుగును. యత్న కార్యసిద్ధి, సుఖము, గౌరవము, సంతోషము కలుగును. నూతన ప్రయత్నములు కలసి వస్తాయి. **కార్తికమున** అకారణ కలహములు ప్రభుకోపమునకు గురి అగుట జరుగును. సంయమనంతో నుండవలయును. కొంత అసౌకర్యముండును. ఉత్సాహ భంగమగును. పూర్వార్థమున కొంత మేలు. ఉత్తరార్థమున శ్రమ అధికము. **మార్గశిరమున** పూర్వార్థమున మిక్కిలి శ్రమ, నిస్సత్తువ, ఉద్యోగమందు ఫలితము లేకుండుటగనేయుండును. ఉత్తరార్థమున ఆరోగ్యము, ద్రవ్యలాభము, ధైర్యము, యత్నకార్యసిద్ధియగుటచే ఉత్సాహము కలుగును. **పుష్య మాసమున** శుభాశుభ మిశ్రమముగనుండును. లాభము, జయము, తనవలన ఇతరులకు బాధ, భార్యాపుత్రాది స్వజన విరోధము, అకారణ వ్యయములు, కలహములు బాధించును. **మాఘ మాసమున** ఆరోగ్యము, ద్రవ్యలాభము, మనస్సుకు సంతోషము, బంధువులతో మైత్రి, కీర్తి కలుగును. శుభమూలక ధనవ్యయము కలుగును. **ఫాల్గునమున** చాలా వరకు వ్యవహారాదులయందు జయము, సన్మానము, వృద్ధియుండును. పూర్వార్థమున మిక్కిలి వైభవము, ఉత్తరార్థమున లాభము, జయము కలిగిననూ ఆరోగ్య విషయమందు జాగ్రత్తగానుండవలయును.

**కృత్తిక** వారికి వైశాఖ శుక్లము వరకు నైధనతార యందు రాహువు, శ్రావణ బహుళము నుండి సంవత్సరాంతము వరకు జన్మతారయందు కేతువు, ఆషాఢ బహుళము నుండి భాద్రపద శుక్లము వరకు, వైశాఖ బహుళము, అధిక జ్యేష్ఠ శుక్లమునందు జన్మతారయందు కుజుడు, ఫాల్గునమునందు జన్మనక్షత్రమునందు కుజుడు సంచరించును. శ్రావణ బహుళము వరకు సప్తశలాక కేతువేధ. అధిక జ్యేష్ఠ బహుళము నుండి ఆషాఢ శుక్లము వరకు మరియు భాద్రపద బహుళము నుండి ఆశ్వయుజ శుక్లము వరకు కుజవేధ. **రోహిణి** వారికి అధిక జ్యేష్ఠ బహుళము నుండి, కార్తిక బహుళము వరకు నైధనతారయందు శని, వైశాఖ బహుళము నుండి జన్మతారయందు కేతువు సంచరించును. అధిక జ్యేష్ఠ బహుళము నుండి ఆషాఢ శుక్లము వరకు మరియు భాద్రపద బహుళము, ఆశ్వయుజ శుక్లములయందు జన్మతారయందు కుజుడు సంచరించును. **మృగశిర** వారికి అధిక జ్యేష్ఠ బహుళము వరకు తిరిగి కార్తిక బహుళము నుండి సంవత్సరాంతము వరకు నైధనతార యందు శని, ఆశ్వయుజ బహుళము, కార్తిక శుక్లములయందు జన్మతారలో కుజుడు సంచరించును. శ్రావణ బహుళము నుండి సంవత్సరాంతము వరకు కేతువేధ. ఆషాఢ బహుళము నుండి భాద్రపద శుక్లము వరకు మరియు వైశాఖ బహుళము నుండి అధిక జ్యేష్ఠ శుక్లము వరకు కుజవేధ కావున జాగ్రత్త అవసరము. అతి జాగ్రత్తగా కానీ ఏ కార్యములు చేయరాదు. ఆయా నక్షత్రముల వారు ఆయా సమయములయందు ఆయా గ్రహములకు శాంతియొనర్చిన మేలు. మొత్తము మీద వీరు శనికి, పూర్వార్థమున గురువునకు శాంతి యొనర్చిన మేలు. ప్రతి నెలా తమ జన్మనక్షత్రము నాడు పరమేశ్వర ప్రీతిగా అభిషేకము, ప్రతి శనివారము హనుమత్పూజా ప్రదక్షిణలు చేయుటచే అష్టమశని దోషము తొలగగలదు.

# మిథున రాశి

## మృగశిర 3,4 పాదములు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదములు

## (కా, కి, కు, ఖం, జ, ఛ, కే, కో, హ)

## ఆదాయం : 14, వ్యయం : 2 - రాజపూజ్యం : 4, అవమానం : 3

వీరికి ఈ సంవత్సరమంతయు సప్తమ శనియగుటచే కొన్ని ఇబ్బందులు ఉండును. అకాల భోజనములు, కళత్రవర్గముతో పేచీలు బాధించును. వ్యాధి వేధయు కలుగును. ద్రవ్యనాశనము, హృదయతాపము కలుగును. భాద్రపద బహుళము వరకు పంచమ గురువు అగుటచే పుత్రవృద్ధి సుజన మిత్రత్వము, ప్రభు అనుకూలతయుండును. ద్రవ్యలాభము ఇష్టకార్యసిద్ధి వలన సంతోషము, బంధు సౌఖ్యము కలుగును. ఆశ్వయుజ శుక్లము నుండి షష్ఠగురువు కావున భార్యాపుత్రాది స్వజన విరోధము, బంధు విరోధము, రాజ, చోర అగ్ని బాధలు కలుగును. వ్యాజ్యములు రోగబాధలు అధికమగును. ఫాల్గునమున సప్తమ గురువు కావున చాలావరకు పరిస్థితులు అనుకూలించును. మాఘ బహుళము వరకు ద్వితీయ రాహువు, అష్టమ కేతువు అయినందున వృధా వైరములు, వ్యయములు అధిక ప్రయాసయుండును. కీర్తి, ద్రవ్యలాభము, దేహసౌఖ్యము ఒకప్పుడు కలుగును. ఫాల్గునమునందు జన్మరాహువు సప్తమ కేతువు అయినందున భార్యాపుత్రాది స్వజన విరోధము, దేశ సంచారము, ప్రవాసము, శారీరక ఇబ్బందులు కలుగును.

**చైత్రమున** పుత్ర భ్రాతృవర్గముతో పేచీలు, ఈర్ష్యా ద్వేషములు ప్రబలును. వృత్తి, ఉద్యోగ వ్యాపారాదులయందు కొన్ని అపనిందలు, ఇబ్బందులు కలుగుచుండును. అయినను అంతిమముగా విజయము, సౌఖ్యము కలుగును. **వైశాఖమున** వివాహాది శుభకార్యములు అనుకూలము. లాభము, జయము కలుగును. పూర్వార్ధము కన్నా ఉత్తరార్ధమున లాభముతో పాటు శ్రమ అధికమగును. ఒకప్పుడు దేశాంతరవాసము, ప్రవాసము, ప్రమాదములు కలుగవచ్చును. కొద్దిగా జాగ్రత్తగనుండిన జయమధికము. **అధిక జ్యేష్ఠమున** ధనలాభము, యత్నకార్యసిద్ధి, లాభము, సౌఖ్యము అధికముగ కలుగును. కీర్తి ప్రతిష్ఠలు కలుగును. ఉత్తరార్ధమున కొంత శ్రమ కలదు. బంధు మిత్రాది స్వజనులలో ఆరోగ్య లోపములు బాధించును. **నిజ జ్యేష్ఠమున** అకాల భోజనములు, బంధువైరము దుష్ట సహవాసములు బాధించును. భార్యాపుత్రాది స్వజనుల వలన కొంత ఉపశమనము కలుగును. ఉత్తరార్ధమున చాలా వరకు అనుకూలముగనుండును. **ఆషాఢమున** పూర్వార్ధము కన్నా ఉత్తరార్ధము ఎంతో మేలుగనుండును. సజ్జన సాంగత్యము, ధనప్రాప్తి, పుత్ర, మిత్ర, కళత్రాదుల సహకారముచే సంతోషము, ఆనందము కలుగును. **శ్రావణమున** శారీరక, మానసిక శ్రమ తొలగి శరీరము సుఖముగనుండును. ఇష్టబంధు సమాగమము, ఋణవిముక్తి, భూగృహ సంపాదన, ఇష్టకార్య సిద్ధియు కలుగును. మాసాంతమున ధనవ్యయము, రాజవిరోధము, మనస్తాపము కలుగును. **భాద్రపదమున** గృహచ్ఛిద్రములు, ప్రయాణములయందు విఘ్నములు బాధించును. ధనధాన్య వృద్ధి, కార్యసిద్ధియగుటచే ఉత్సాహము కలుగును. ఆకస్మిక ధనలాభము కలుగును. **ఆశ్వయుజమున** బుద్ధిమాంద్యము, మిత్రుల వలన సమస్యలు, కొన్ని ఇబ్బందులు, పూర్వార్ధమున కలుగును. ఉత్తరార్ధమున కొంత మేలు జరుగును.

ఋణ, రోగ, శత్రు విముక్తి, సౌఖ్యము కలుగును. **కార్తికమున** ఉత్తరోత్తరా మహా సౌఖ్యము, తలచిన కార్యములు నెరవేరుట దీర్ఘకాలిక సమస్యలు పరిష్కారమగుట భూగృహవసతి పొందుటయు జరుగును. మొత్తము మీద వైశాఖ బహుళము నుండి ఆశ్వయుజము వరకు గల 'అష్టమమున కుజస్తంభన' తొలగినందున చాలా వరకు అనుకూల పరిస్థితులుండును. **మార్గశిరమున** పూర్వార్ధమంతయు, అన్నివిధముల అనుకూలతయుండును. ఉత్తరార్ధమున, మాసాంతమున శ్రమ, అలసట, ఉద్యోగములయందు శ్రమ, అకాల భోజనములు బాధించును. **పుష్య మాసమున** మిక్కిలి శ్రమ, భార్యాపుత్రాది స్వజనులతో విరోధములు, వారి ఆరోగ్య లోపముల వలన కలిగెడి మానసిక అశాంతి అధికము. శత్రువృద్ధి కలుగును. కావున వాదములు మానవలయును. వృత్తి ఉద్యోగాదులయందు సాహసములు చేయరాదు. **మాఘమున** శారీరక, మానసిక శ్రమ, వృథా వైరములున్నను, కొన్ని రంగముల యందు తగినంత విజయము, జయముండుట వలన చాలా వరకు ఉత్సాహముగనేయుండును. సోమరితనము వీడవలయును. **ఫాల్గునమున** ఇష్టబంధు సమాగమము దుఃఖనాశనము, అనేక విషయములయందు లాభసాటిగనుండుటచే స్వల్ప అవరోధములున్ననూ బాధించవు. ఈ మాసము శుభాశుభ మిశ్రమముగా, కొంత అధిక శుభముగనుండును. వర్తక వాణిజ్యాదులయందు జాగ్రత్త అవసరము.

**మృగశిర** వారికి అధిక జ్యేష్ఠ బహుళము వరకు తిరిగి కార్తిక బహుళము నుండి సంవత్సరాంతము వరకు నైధనతారయందు శని, ఆశ్వయుజ బహుళము, కార్తిక శుక్లములయందు జన్మతారలో కుజుడు సంచరించును. శ్రావణ బహుళము నుండి సంవత్సరాంతము వరకు కేతువేధ. ఆషాఢ బహుళము నుండి భాద్రపద శుక్లము వరకు మరియు వైశాఖ బహుళము నుండి అధిక జ్యేష్ఠ శుక్లము వరకు కుజవేధ. **ఆర్ద్రా** నక్షత్రము వారికి శ్రావణ బహుళము నుండి సంవత్సరాంతము వరకు నైధనతార యందు కేతువు, వైశాఖ బహుళం, అధిక జ్యేష్ఠ శుక్లములయందు, ఆషాఢ బహుళము నుండి భాద్రపద శుక్లము వరకు నైధనతారయందు కుజుడు, కార్తికమందు జన్మతారయందు కుజుడు సంచరించును. అధిక జ్యేష్ఠ బహుళము వరకు తిరిగి కార్తిక బహుళము నుండి శనివేధయుండును. చైత్ర బహుళము, వైశాఖ శుక్లములయందు కుజవేధ. **పునర్వసు** వారికి పుష్య శుక్లము నుండి సంవత్సరాంతము వరకు జన్మతారయందు రాహువు, శ్రావణ బహుళము వరకు నైధనతారయందు కేతువు, అధిక జ్యేష్ఠ బహుళము నుండి ఆషాఢ శుక్లము వరకు మరియు భాద్రపద బహుళము, ఆశ్వయుజ శుక్లములయందు నైధనతార యందు కుజుడు సంచరించును. అధిక జ్యేష్ఠ బహుళము నుండి కార్తిక బహుళము వరకు శనివేధగలదు. చైత్ర శుక్లమునందు కుజవేధగలదు. కావున ఆయా నక్షత్రముల వారు ఆయా సమయములయందు తగు జాగ్రత్తగనుండి ఆయా గ్రహములకు తగు శాంతియొనర్చిన మేలు జరుగును. శని, రాహు, కేతువులకు, ఉత్తరార్ధమున గురువునకు, కుజునకు ప్రత్యేకముగ శాంతి చేయవలయును. హనుమత్పూజా ప్రదక్షిణాదులు, అశ్వత్థ సేవ, ప్రతిమాసమున పరమేశ్వరునికి అభిషేకము చేసిన శుభము కలుగును.

# కర్కాటక రాశి

## పునర్వసు 4వ పాదము, పుష్యమి, ఆశ్లేష

## (హి, హు, హే, హో,డా, డీ, డూ, డే, డో )

## ఆదాయం : 8, వ్యయం : 2 - రాజపూజ్యం : 7, అవమానం : 3

వీరికి ఈ సంవత్సరమంతయు షష్ఠశని అయినందున చాలా వరకు తలచిన కార్యములు నెరవేరును. శుభకార్యానుకూలతయుండును. సుఖము కలుగును. ధనధాన్యవృద్ధి కలుగును. ఇష్టబంధువు అగును. గృహనిర్మాణమునకు ప్రయత్నములు కలసి వస్తాయి. భాద్రపద బహుళము వరకు చతుర్థ గురువు అయినందున బుద్ధి చాంచల్యము, తేజోహాని, ప్రవాసము, బంధుమూలక వ్యధ కలుగును. అటు పిమ్మట ఆశ్వయుజము నుండి మాఘ మాసము వరకు పంచమ గురువు అగుటచే పుత్రవృద్ధి, సుజన మిత్రత్వము, ప్రభు అనుకూలతయుండును. ద్రవ్యలాభము, బంధువుల వలన సౌఖ్యము, ఇష్టకార్యసిద్ధి కలుగును. ఫాల్గునమునందు షష్ఠ గురువు అగుటచే కొంత అననుకూల వాతావరణముండును. స్వజన విరోధము, చోరాగ్ని బాధలు కలుగును. వీరికి ఈ సంవత్సరము మాఘ మాసము వరకు జన్మరాహువు సప్తమ కేతువు అయినందున వృధా వైరములు, భార్యాపుత్రాది స్వజనులలో కూడా కలుగును. ఆరోగ్యలోపములు, వృధా వ్యయములు కళత్రవర్గముతో పేచీలు ఏర్పడగలవు. ఫాల్గునమునందు షష్ఠకేతువు, వ్యయరాహువు అగుటచే లాభము, జయము, ప్రోత్సాహము, శత్రువులపై వ్యాజ్యములు గెలువగలుగుట మొదలగు శుభఫలములు కలుగును. కానీ జాగ్రత్తగనుండవలయును. నేత్రవ్యాధులు, ధననాశనము ఒకప్పుడు కలుగువచ్చును.

**చైత్రమున** శారీరక, మానసిక అలసత్వము, ధనవ్యయము, బుద్ధినాశనము కలుగును. ఆహార నియంత్రణ లేకపోవుట వలన ఇబ్బందులు పడవలసివచ్చును. కావున జాగ్రత్త అవసరము. ఇష్టబంధు సమాగమము, రాజ దర్శనము, దైవ కార్యములయందు ఆసక్తియు కలుగును. **వైశాఖమున** కించిదపవాదములు, మనోవ్యాకులతయున్నను, ఎక్కువగా లాభము, జయము, ప్రోత్సాహము కలుగును. నూతన వృత్తి, ఉద్యోగ వ్యాపారాదులకు మంచి అనువగు కాలము. యత్నకార్యసిద్ధి వలన ఉత్సాహము కలుగును. **అధిక జ్యేష్ఠమున** పుత్ర భ్రాతృమూలక వ్యధ కలుగవచ్చును. పూర్వార్ధమున అపనిందలు, వృధా వైరములు, ఉత్తరార్ధమున మిక్కిలి గౌరవము, ద్రవ్యలాభము, కీర్తి ప్రతిష్ఠలు కలుగును.సమస్యలు తొలగును. శారీరక ఆరోగ్యము చక్కగ చూసుకొనవలయును. **నిజ జ్యేష్ఠమున** ప్రవాసము, బంధువులకు శారీరక వ్యాధి, తన్మూల ధనవ్యయము, సౌఖ్యము తక్కువ. కలహములు సంభవించును. కుటుంబ సభ్యుల సహకారము చక్కగా ఉండును. ఉత్తరార్ధమున సమస్యల నుండి బయటపడుదురు. **ఆషాఢమున** సౌఖ్యము, ఆరోగ్యము, సంతోషము బాగుండును. సాధు సత్పురుషులతో, మిత్రులతో జగడములు మానవలయును. అకాల భోజనములు, జఠర సంబంధ సమస్యలు కలుగును కావున జాగ్రత్త అవసరము. **శ్రావణమున** ఉత్తరార్ధమున సుజన మిత్రత్వము, సౌఖ్యము, శాంతి కలుగును. పూర్వార్ధమున వర్తక, వ్యాపార కృషియందు అనుకోని నష్టము,

దుష్టసాంగత్యము కలుగును. ద్రవ్యనాశనమగును. ఉత్తరార్ధమున మాసాంతమున గొప్పలాభము, ఉత్సాహము కలుగును. **భాద్రపదమున** శారీరక, మానసిక శ్రమ తొలగి సౌఖ్యము కలుగును. ధనప్రాప్తి, ఇష్టకార్యార్ధసిద్ధియగును. విద్యా వ్యాసంగములు, గొప్పవారితో పరిచయములు, బంధుమూలక కార్యసిద్ధి కలుగును. ఉత్తరార్ధమున మరుపు జాడ్యము వలన కొన్ని సమస్యలు వచ్చిననూ మొత్తం మీద బాగుండును. **ఆశ్వయుజమున** పూర్వార్ధమున సర్వకార్యములయందు ఉత్తమముగనుండగలదు. నూతన ఆరంభములకు అనువగు కాలము. ఉత్తరార్ధమున కించిత్ శ్రమ, ప్రయాణాదులయందు ఇబ్బందియునుండును. **కార్తికమున** మిక్కిలి శ్రమ, శారీరక అలసత్వము, అకస్మాత్తుగా కలహములు కలుగును. దేశాంతరవాసము, ఋణబాధలు, అవమానములు కలుగును. కనుక ముందు జాగ్రత్తతో ఉండవలయును. **మార్గశిరమున** పూర్వార్ధమున మిక్కిలి శ్రమయున్ననూ, ఉత్తరార్ధమున చాలా వరకు సమస్యలు పరిష్కరించబడును. శుభకార్యములకు చేయు ప్రయత్నములు కలసి వస్తాయి. **పుష్య మాసమున** పూర్వార్ధమునందు శుభవార్తా శ్రవణము, శుభ యోగములు కలుగును. ఉత్తరార్ధమున జఠర సంబంధ వ్యాధులు కలుగును. భార్యాపుత్రాది స్వజనుల వలన ఆనందము కలుగును. శారీరకమగు సమస్యలు అశ్రద్ధజేయరాదు. **మాఘ మాసమున** వృత్తి, ఉద్యోగ వ్యాపారాదులయందు అలసట, శ్రమ, ప్రయాణాదులయందు ఇబ్బంది, శత్రువృద్ధి. భీతి కలుగును. అంతగా అనువగు కాలము కాదు. **ఫాల్గునమున** పూర్వార్ధము అంతగా యోగించదు. కానీ ఉత్తరార్ధము బాగుండును. ఏదయినా తలచిన కార్యములు నెరవేరును. క్లిష్టమయిన కార్యములు కూడా సానుకూలపడగలవు. మొత్తము మీద బాగుండును.

**పునర్వసు** వారికి పుష్య శుక్లము నుండి సంవత్సరాంతము వరకు జన్మతార యందు రాహువు, శ్రావణ బహుళము వరకు నైధనతార యందు కేతువు, అధిక జ్యేష్ఠ బహుళము నుండి ఆషాఢ శుక్లము వరకు మరియు భాద్రపద బహుళము ఆశ్వయుజ శుక్లములయందు నైధనతారయందు కుజుడు సంచరించును. అధిక జ్యేష్ఠ బహుళము నుండి కార్తిక బహుళము వరకు శనివేధ గలదు. **పుష్యమి** వారికి వైశాఖ బహుళము నుండి మార్గశిర బహుళము వరకు జన్మతారయందు రాహువు, ఆశ్వయుజ బహుళము కార్తిక శుక్లములయందు నైధనతారయందు కుజుడు సంచరించును. **ఆశ్లేష** వారికి వైశాఖ శుక్లము వరకు జన్మనక్షత్రమునందు రాహువు, పుష్య బహుళమునందు జన్మతారయందు కుజుడు సంచరించును. ఆశ్వయుజ బహుళమునందు కుజవేధ. కావున వీరలీసమయములయందు కడు జాగ్రత్తగా గానీ ఏపని చేయరాదు. ఆయా గ్రహములకు ఆయా సమయములందు తగు శాంతియొనర్చిన మేలు. మొత్తము మీద ఈరాశి వారు పూర్వార్ధమున గురువునకు, రాహు కేతువులకు సంవత్సరమంతయూ శాంతి యొనర్చిన మేలు. అశ్వత్థ నారాయణ సేవ, గురుసేవ, దుర్గా సప్తశతీ పారాయణ చేయుట వలన ఇబ్బందులు తొలగును.

# సింహ రాశి

## మఘ, పూర్వఫల్గునీ, ఉత్తరఫల్గునీ 1వ పాదము
## (మ, మి, ము, మె, మో, ట, టి, టు, టే )

## ఆదాయం : 11, వ్యయం : 11 - రాజపూజ్యం : 3, అవమానం : 6

వీరికి ఈ సంవత్సరము పంచమ శనియగుటచే సర్వము వ్యతిరేకముగ తోచును. ఆస్తి నష్టము. కళత్ర బంధుమూలక వ్యథ, తరచుగనేదో ఒక సమస్య ఎదురగును. తలచిన కార్యములు చెడును. మనస్తాపము, వ్యాజ్యములు బాధించును. మర్యాదాభంగకరమయిన విషయములయందాసక్తి కలుగును. గురువు భాద్రపదము వరకు తృతీయమందు, పిదప మాఘమాసము వరకు చతుర్థమందుండును కావున శ్రమ, బంధు విరోధము, దరిద్రము, ఉద్యోగ భంగము, బుద్ధి చాంచల్యము, తేజోహాని కలుగును. ప్రవాసము, దూరప్రయాణాదులు కలుగును. ఫాల్గునమునందు పంచమ గురువు అయినందున కొంత ఉత్సాహకరమయిన వాతావరణముండును. మిత్రలాభముచే శుభకార్యానుకూలత యుండును. వీరికి మాఘమాసము వరకు ద్వాదశరాహువు, షష్ఠ కేతువు, పిమ్మట ఫాల్గునమునందు లాభరాహువు పంచమ కేతువు అయినందున కొంత లాభము, కొంత వ్యయము రీతిగనుండును. లాభము, జయము, ప్రోత్సాహము కలుగును. గో, భూ లాభములు కలుగును. ఒకప్పుడు గొప్ప సన్మానము, నేత్రబాధలు కలుగును.

**చైత్రమున** చెడునడత, దానిని కప్పిపుచ్చుటకు తిరిగి తప్పులు చేయుట, హృదయతాపము, వ్యాకులతయుండును. అయినను మధ్యమధ్య కొంత సంతోషము, వస్త్రలాభము, ఇష్టార్థసిద్ధియు కలుగును. **వైశాఖమున** వ్యాకులత, బలము లోపించుట, పశ్చాత్తాపము అధికముగనుండును. భోజనమునందు క్రమశిక్షణ లోపించుటచే కలుగు అనారోగ్యము, అకారణ కలహములు, వృధా వ్యయములు కలుగును. **అధిక జ్యేష్ఠమున** సర్వారిష్టములు తొలగి పూర్వ వైభవము, కాంతి తిరిగి పొందును. బంధు మిత్ర సమాగమము, సుజనమైత్రి, తన్మూలకముగ కార్యసిద్ధి, రాజదర్శనము, సంతోషము అధికముగనుండును. మధ్యమధ్య అపవాదముల నుండి జాగ్రత్తగ బయటపడవలయును. **నిజ జ్యేష్ఠమున** ద్రవ్యలాభము కలుగును. ఉత్సవములు, తన్మూలక ధనవ్యయమగును. మధుర పదార్థ భక్షణ జరుగును. ఉత్తరార్థమున స్వల్పముగ ఇబ్బంది, మాసాంతమున తిరిగి సౌఖ్యము, ధనప్రాప్తి, ఉత్సాహము కలుగును. **ఆషాఢమున** మాస ప్రారంభమున తలచిన కార్యములన్నియు పూర్తియగుటచే ఉత్సాహము కలుగును. మధ్య ప్రాంతమున కొంత ఉత్సాహము తగ్గును. వ్యయము పెరుగును. మాసాంతమున తిరిగి నూతనోత్తేజము కలుగును. ఆర్థికముగా బాగుండును. కీర్తిప్రతిష్ఠలు కలుగును. మాట చెల్లుబడియగును. **శ్రావణమున** పరిస్థితులు మిశ్రమముగనుండును. బంధుమిత్రులతో విరోధము కలుగును. కృషి, వాణిజ్యాదులయందు నష్టము కలుగును. శారీరక సౌఖ్యము, వస్త్రలాభము కలుగును. మాసాంతమున శత్రువృద్ధియుండును. **భాద్రపదమున** ఉద్యోగాదులయందు తీవ్రమగు ఒత్తిడి, ఉద్యోగ భంగము, వర్తకమూలకముగా ధనవ్యయము, బంధుమిత్ర విరోధము కలుగును. దుష్టసాంగత్యము, అందుచే

పాపకార్యాసక్తియుండును. సుజన సాంగత్యము వలన నష్ట స్థితిని నివారించి ధనలాభము, కీర్తిని పొందగలరు. **ఆశ్వయుజమున** ప్రారంభమున పూర్వార్ధమంతయు అధిక శ్రమకరముగనున్ననూ, ఉత్తరోత్తరా ఉత్సాహము, జయము, కలుగును. బంధు మిత్రుల సహకారము లభించును. ధనప్రాప్తి కలుగును. స్వబుద్ధితో చేసిన పనులు సిద్ధించును. **కార్తికమున** సర్వము అనుకూలముగనుండిననూ, మధ్యమధ్య ఏదో ఒక సమస్య, క్లేశము, పుత్ర, భ్రాతృమూలకముగనేదో సమస్యయుండును. ఉత్తరార్ధమున ప్రయాణాదులయందు ఇబ్బందులు ఎదురగును. **మార్గశిరమున** దుర్వార్తా శ్రవణము, అనేక ఇబ్బందులుండును. కావున బుద్ధిని జాగ్రత్తగా వాడవలయును. ఉత్తరార్ధమున స్థానచలనము, ఋణబాధలు కలుగగలవు. **పుష్య మాసమున** శ్రమకరముగనుండును. పూర్వార్ధము కన్నా ఉత్తరార్ధము చాలా వరకు అనుకూలముగనుండును. **మాఘ మాసమున** ప్రారంభమున చాలా వరకు అనుకూలము కావున నూతనారంభములు, వాణిజ్యము, కృషివృద్ధి ప్రయత్నములు కలసివచ్చును. మధ్య ప్రాంతము నుండి ఉత్సాహము తగ్గును. ప్రభుకోపము, ఆందోళన కలుగును. **ఫాల్గునమున** అకాల భోజనము, వృత్తి, ఉద్యోగాదుల కొరకు అధిక ప్రయాణములు అందుచే నీరసించిన స్థితియూ కలుగును. భార్యాపుత్రాది స్వజన విరోధము కలుగును. ఉత్సాహలేమిచే విజయములు ఆలస్యమగును.

**మఘ** వారికి అధిక జ్యేష్ఠ బహుళము నుండి కార్తిక బహుళము వరకు జన్మతారయందు శని, పుష్యశుక్లము నుండి సంవత్సరాంతము వరకు నైధనతార యందు రాహువు, చైత్రశుక్లమునందు, మాఘశుక్లమునందు జన్మతారయందు కుజుడు సంచరించును. శ్రావణ బహుళము వరకు కేతువేధ, అధిక జ్యేష్ఠ బహుళము నుండి ఆషాఢ శుక్లము వరకు మరియు భాద్రపద బహుళము, ఆశ్వయుజ శుక్లమునందు మరియు మాఘ, ఫాల్గునములందు కుజవేధ కలదు. **పూర్వఫల్గుని** వారికి అధిక జ్యేష్ఠ బహుళము వరకు మరియు కార్తిక బహుళము నుండి సంవత్సరాంతము వరకు జన్మతారయందు శని, వైశాఖ బహుళము నుండి మార్గశిర బహుళము వరకు నైధనతారయందు రాహువు, చైత్ర బహుళ, వైశాఖ శుక్లములయందు, మాఘ బహుళము, ఫాల్గున శుక్లములయందు జన్మతారయందు కుజుడు, మార్గశిర బహుళము, పుష్య శుక్లములయందు నైధనతారయందు కుజుడు సంచరించును. మాఘ శుక్లమునందు కుజవేధ. **ఉత్తరఫల్గుని** వారికి వైశాఖ శుక్లము వరకు నైధనతారయందు రాహువు, శ్రావణ బహుళము నుండి సంవత్సరాంతము వరకు జన్మతారయందు కేతువు సంచరించును. వైశాఖ బహుళము, అధిక జ్యేష్ఠ శుక్లమునందు, తిరిగి ఆషాఢ బహుళము నుండి భాద్రపద శుక్లము వరకు జన్మతారయందు కుజుడు, ఫాల్గునమునందు జన్మతారలో కుజుడు, పుష్యమాసమునందు నైధనతారయందు కుజుడు సంచరించును. పుష్య బహుళమునందు కుజవేధ గలదు. కావున వీరలకీసమయములందు జాగ్రత్త అవసరము. ప్రత్యేకించి కుజ, కేతువుల జన్మతార సంచారము, వేధ సమయములయందు జాగ్రత్త అవసరము. మొత్తం మీద ఈ రాశి వారికి ఈ సంవత్సరము గురుబలము సరిగా లేనందున గురు, శనులకు, కార్తికము నుండి కుజునకు శాంతియొనర్చిన మేలు. హనుమత్పూజా ప్రదక్షిణాదులు, గురుసేవ వలన దోషములు తొలగగలవు.

# కన్యా రాశి

## ఉత్తరఫల్గుని 2, 3, 4 పాదములు, హస్త, చిత్ర 1, 2 పాదములు (టొ, పా, పి, పూ, ష, ణ, ఢ, పె, పో)

## ఆదాయం : 14, వ్యయం : 2 - రాజపూజ్యం : 6, అవమానం : 6

వీరికి ఈ సంవత్సరమంతయు అర్ధాష్టమ శనియగుటచే శ్రమకరమగు కాలము. అనేక సమస్యలు వచ్చును. జాగ్రత్త అవసరము. కళత్ర పీడ, ఆస్తి నష్టము, శారీరక, మానసిక అలసట, స్వస్థాన హాని కలుగును. వాతబాధలు కలుగును. భాద్రపద బహుళము వరకు ద్వితీయ గురువు అయినందున మనస్సునకానందము, యశోవృద్ధి, సౌభాగ్యము, ధనలాభము, ధర్మకార్యములకు ధనవ్యయము చేయుట వలన మనస్తుష్టి కలుగును. ఆశ్వయుజము నుండి మాఘమాసము వరకు తృతీయ గురువు పిమ్మట ఫాల్గుణమునందు చతుర్థ గురువు అగుటచే గురువు అనుకూలుడు గాదు. కొన్ని కార్యములు నెరవేరిననూ ఉద్యోగభంగము, మిత్రవియోగము, కార్యభంగము, బంధు విరోధము ఒకప్పుడు కలుగును. తేజోహాని, స్వస్థాన త్యాగము ఒకప్పుడు కలుగును. మాఘమాసము వరకు లాభరాహువు, పంచమకేతువు కావున లాభము, జయము ప్రోత్సాహము కలుగును. గౌరవ మర్యాదలు సన్మానము కలుగును. పుత్రవిరోధము కలుగును. ఫాల్గునమునందు దశమ రాహువు చతుర్థ కేతువు అయినందున ప్రయాణాదులయందు ఇబ్బందులు కలుగును. కొంత సంతోషము కలుగును.

**చైత్రమున** పొరుగు వారితో కలహములు, మిక్కిలి ద్వేషము, భార్యకు పీడయు, స్వజన విరోధము, ద్రవ్యనాశనము, రోగము వలన వేదనయు కలుగును. ప్రయాణములయందు ఇబ్బందులు కలుగును. ఉత్తరార్ధమున కొంత శుభకరముగ నుండును. ఇష్టబంధు సమాగమము, రాజదర్శనము కలుగును. **వైశాఖమున** శత్రువృద్ధి, ప్రయాణాదులయందు ఇబ్బందులుండును. శస్త్రలాభము, ఇష్టార్థసిద్ధి కలుగును. దేవబ్రాహ్మణపూజ, కులదేవతల పూజయు చేయుటకు తగు కాలము. **అధిక జ్యేష్ఠమున** వ్యాకులము, బలహాని, ద్రవ్యనాశనము, శత్రు భయము, ఈతి బాధలు కలుగును. గౌరవహాని కలుగును. భోజన విషయములయందు శ్రద్ధ అవసరము. లేనిచో ఉదర సంబంధ వ్యాధులు కలుగవచ్చును. **నిజ జ్యేష్ఠమున** ఆరోగ్యము, ద్రవ్య లాభము, మనస్సున సంతోషము, రాజదర్శనము, రాజసంభాషణము, మంచి సౌఖ్యము కలుగును. కీర్తి ప్రతిష్ఠలు, ఇష్టకార్యార్థ సిద్ధి, క్షీరాన్నభోజనము కలుగును. **ఆషాఢమున** సర్వకార్యములయందు జయము, ప్రోత్సాహము, లాభము కలుగును. ఉన్నతోద్యోగము, చేయు పనులయందు ఆర్థికవృద్ధి యుండును. పూర్వార్ధమున చోర రోగ బాధలు కలుగును. ఉత్తరార్ధమున సౌఖ్యము, ఆహ్లాదము కలుగును. **శ్రావణమున** గృహమందు వివాహాది శుభకార్యములు, ఎల్లప్పుడు ఉత్సవము, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. ఇష్టబంధు సమాగమము కలుగును. ఉత్తరార్ధమున ధనవ్యయము, స్థానభ్రష్టత్వము కలుగును. ఉత్తరార్ధమున అతి జాగ్రత్తగా నిర్ణయములు తీసుకొనవలయును. **భాద్రపదమున** బుద్ధినాశనము, శారీరక, మానసిక శ్రమ, బంధు మిత్రులతో విరోధము కలుగును.

ఆర్థిక లాభము కలుగును. **ఆశ్వయుజమున** ఆకస్మిక ద్రవ్యప్రాప్తి, ఎల్లప్పుడు సుఖము, సత్సంగత్వము కలుగును. బంధుమిత్రులతో విరోధము కలుగును. కావున జాగ్రత్త అవసరము. వర్తక, వాణిజ్యములయందు మిశ్రమ ఫలితములుండును. **కార్తికమున** మంచి సుఖము, యత్నకార్య సిద్ధియగును. ధనధాన్య లాభము, భూగృహ సంపాదన, ఋణ విముక్తి కలుగును. బుద్ధి జాడ్యము, మతిమరుపు వలన ఒక్కొక్కపుడు ప్రభుకోపమునకు గురియగును. **మార్గశిరమున** చాలా వరకు ప్రయత్నించిన కార్యములు నెరవేరును. ఉత్తరార్ధమున బుద్ధి భ్రంశము, బంధుమిత్రాది స్వజన విరోధము కలుగును. **పుష్య మాసమున** గృహచ్ఛిద్రములు, సుఖము లేకుండుట, ప్రయాణములయందు ఇబ్బందులు కలుగును. భ్రాతృ వర్గముతో పేచీలు, దురాలోచనలు, వృథా వాక్కుల వలన సమస్యలు వచ్చును. **మాఘ మాసమున** శుభాశుభ మిశ్రమముగనుండగలదు. దేశాంతరవాసము, ఆరోగ్య లోపములు ఒకప్పుడు కలుగును. ఉత్తరార్ధమున భూగృహ సంపాదన, సంతోషము, విద్యా వ్యాసంగము కలుగును. **ఫాల్గునమున** మంచి సుఖము యత్నకార్య సిద్ధి పూర్వార్ధమునయుండును. ఉత్తరార్ధమున సమయమునకు అనుకున్న పనులు జరుగనందున ఉత్సాహము తగ్గును. భార్యాపుత్రాది స్వజన విరోధము కలుగును. ఆదాయము, సేవక వృద్ధి ఒకప్పుడు కలుగును.

**ఉత్తరఫల్గుని** వారికి వైశాఖ శుక్లము వరకు నైధనతారయందు రాహువు, శ్రావణ బహుళము నుండి సంవత్సరాంతము వరకు జన్మతారయందు కేతువు సంచరించును. వైశాఖ బహుళము, అధిక జ్యేష్ఠ శుక్లములయందు తిరిగి ఆషాఢ బహుళము నుండి భాద్రపద శుక్లము వరకు జన్మతారయందు కుజుడు, ఫాల్గునమునందు జన్మతారయందు కుజుడు సంచరించును. పుష్యమాసమునందు నైధనతారయందు కుజుడు, పుష్య బహుళమునందు కుజవేధ గలదు. **హస్తా** నక్షత్రము వారికి అధిక జ్యేష్ఠ బహుళము నుండి కార్తిక బహుళము వరకు నైధనతార యందు శని. శ్రావణ బహుళము వరకు జన్మతారయందు కేతువు, అధిక జ్యేష్ఠ బహుళము నుండి ఆషాఢ శుక్లము వరకు మరియు భాద్రపద బహుళము, ఆశ్వయుజ శుక్లములందు జన్మతార యందు కుజుడు సంచరించును. మార్గశిర బహుళము పుష్య శుక్లములయందు కుజవేధ గలదు. **చిత్రా** నక్షత్రము వారికి అధిక జ్యేష్ఠ బహుళము వరకు, తిరిగి కార్తిక బహుళము నుండి నైధనతైరయందు శని, ఆశ్వయుజ బహుళము, కార్తిక శుక్లములందు జన్మతారయందు కుజుడు, మరియు మార్గశిరమునందు కుజవేధ కావున జాగ్రత్త అవసరము. కావున వీరలీసమయములందు ఆయా గ్రహములకు తగు శాంతియొనర్చిన మేలు. మొత్తము మీద వీరు ఈ సంవత్సరము శనికి ఉత్తరార్ధమున గురువునకి, సంవత్సరాంతమున కుజ, రాహు, కేతువులకు శాంతియొనర్చిన మేలు. ప్రతి మాసము తమ జన్మ నక్షత్రము నాడు, కార్తిక మాసమునందు ప్రతి సోమవారము, ఏకాదశి నాడు పరమేశ్వర ప్రీతిగ అభిషేకము చేయించిన అర్ధాష్టమశని దోషము తొలగి సుఖింతురు.

# తులా రాశి

## చిత్ర 3,4 పాదములు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదములు
## (రా, రి, రూ, రే, రో, త, తీ, తూ, తే)
## ఆదాయం : 11, వ్యయం : 5 - రాజపూజ్యం : 2, అవమానం : 2

వీరికి ఈ సంవత్సరమంతయు తృతీయశని యగుటచే సర్వము అనుకూలించును. ఋణవిముక్తి, భూగృహ సంపాదన కలుగును. ఉద్యోగము ప్రాప్తించును. స్వబుద్ధితో యత్నించిన కార్యములు సిద్ధించును. భాద్రపద బహుళము వరకు జన్మగురువు అయినందున రాజాగ్రహమునకు గురి అగుట, కీర్తిహాని, స్థానచలనం, శత్రుత్వం, బుద్ధిభ్రంశము, భయము అగును. అటు పిమ్మట ఆశ్వయుజము నుండి మాఘ మాసము వరకు ద్వితీయ గురువు అయినందున ఉత్తరోత్తరా ధన సంపాదన, సుఖము కీర్తి ప్రతిష్టలు, మాట గౌరవము పొందుట జరుగును. ధర్మకార్యములయందు ధనవ్యయము వలన ఆత్మ సంతృప్తియగును. ఫాల్గునమున తృతీయ గురువు అయినందున శ్రమ అధికము, ఉద్యోగ భంగము, జగడములు కలుగును. మాఘ మాసము వరకు దశమ రాహువు, చతుర్థ కేతువు అయినందున శుభాశుభ మిశ్రమముగనుండును. చిత్త చాంచల్యము, వాత రోగములు ప్రయాణాదుల యందు ఇబ్బందులు కలుగును. ఉద్యోగాదుల యందు కొంత ఇబ్బంది, కొంత శుభము కలుగును. తలచిన కార్యములు నెరవేరును. ఫాల్గునమున తృతీయ కేతువు, భాగ్యరాహువు అయినందున పశునష్టం, ధనధాన్య నష్టములుండును. మర్యాదాహాని కలుగును. కొంత లాభము, జయము కలుగును.

**చైత్రమున** యత్నకార్య సిద్ధి, శారీరక సుఖము, ధన ధాన్య వస్త్ర లాభము, అయత్న ధనలాభము కలుగును. విద్యా లాభము కలుగును. మధ్య మధ్య భార్యాపుత్రాది స్వజన విరోధము కలుగును. **వైశాఖమున** చాలా వరకు అనుకూలముగనుండును. అయతే ఇరుగుపోరుగు వారితో వాగ్వివాదములు కొంతవరకు బాధించును. దుఃఖ నాశనము, గొప్ప సౌఖ్యము బంధువులతో సమాగమము రాజ దర్శనము, ద్రవ్య లాభము కలుగును. ఉత్తరార్ధమున శ్రమ అధికమగును. **అధిక జ్యేష్ఠమున** కొంత శుభమున్ననూ, దుష్ప్రవర్తన వలన శత్రువృద్ధియగును. జాగ్రత్త అవసరము. మరియు ప్రయాణాదులయందు భయము కలుగును. ఆరోగ్య లోపములు కలుగ గలవు. కావున జాగ్రత్త అవసరము. ఉత్తరార్ధమున భీతి కలుగును. **నిజ జ్యేష్ఠమున** శారీరక, మానసిక అలసత్వము, అందుచే వృత్తి, ఉద్యోగ వ్యాపారాదులయందు అధికారుల ఆగ్రహమునకు గురియగుట మరియు అపనిందలు అధికమగును. తరచుగ పశ్చాత్తాపమునకు గురియగుటనుండును. దోషము లేకయే నిందలు కలుగును. కావున జాగ్రత్తగానుండవలయును. **ఆషాఢమున** చాలా వరకు సమస్యలు పరిష్కరించ బడును. ఉద్యోగాదులయందు వృద్ధి, నిందలు తొలగి ఆనందము కలుగును. పోయిన కీర్తి ప్రతిష్ఠలు, తేజస్సు తిరిగి పొందును. చాలా వరకు శుభము కలుగును.

ఉత్తరార్ధమున జాగ్రత్తగనుండనిచో కృషి, వాణిజ్యాదులయందు నష్టము జరుగవచ్చును. **శ్రావణమున** కృషి, వాణిజ్యాదులయందు విఘ్నములు, అపవాదులు, సౌఖ్యలేమి కలుగును. ఏది ఎట్లున్ననూ, గృహమునందు సంతోషము, ఉత్సవము, శుభకార్యములు జరుగును. మధుర భోజనము లభ్యమగును. **భాద్రపదమున** భార్యాపుత్రాది స్వజనులలో ఆరోగ్య లోపములు బాధించును. ఒకప్పుడు గొప్ప ఇబ్బంది కలుగును. సౌఖ్యము చెడును. కలహములు ఇబ్బంది పెట్టును. గట్టిగ ప్రయత్నించిన ధనలాభము కలుగును. **ఆశ్వయుజమున** పూర్వార్ధమున మిక్కిలి శ్రమ, దౌర్బల్యము, దుష్టజన సాంగత్యము కలుగును. సాధు సత్పురుషులతో విరోధము కలుగును. ఉత్తరార్ధమున ద్రవ్యప్రాప్తి, ఎల్లప్పుడు సుఖము, ఆరోగ్యము, సజ్జన సాంగత్యము కలుగును. **కార్తికమున** వర్తక వాణిజ్యాదులయందు నష్టము కలుగును. సజ్జన సాంగత్యము, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. **మార్గశిరమున** ఉత్తరోత్తరా శుభముగనుండగలదు. ఇష్టబంధు సమాగమము, ధనప్రాప్తి, ఉల్లాసము కలుగును. పుణ్యకార్యములయందాసక్తి, ధనధాన్య వస్త్ర లాభము కలుగును. పూర్వార్ధము కన్నా ఉత్తరార్ధమున అధిక శుభము. **పుష్య మాసమున** శుభమధికము. సకల కార్యములయందు జయము, అనుకూలతయునుండును. స్వబుద్ధిచే చేయు యత్నములు ఫలిస్తాయి. **మాఘ మాసమునందు** భ్రాతృవర్గముతో వ్యాజ్యములు, వివాదములు కలుగ గలవు. అకస్మాత్తుగా కలహములు, ఇబ్బందులు కలుగును. మొత్తం మీద శ్రమ అధికము, శారీరక అలసత్వము కలుగును. **ఫాల్గునమున** విద్యా వ్యాసంగము సాగును. దేశాంతరవాసము కలుగును. ఋణబాధలు కలుగును. ఉత్తరార్ధమున శుభాశుభ మిశ్రమముగనుండును. కించిత్సుఖము, కించిద్దుఃఖము కలుగును.

**చిత్రా** నక్షత్రము వారికి అధిక జ్యేష్ఠ బహుళము వరకు తిరిగి కార్తిక బహుళము నుండి సంవత్సరాంతము వరకు నైధనతార యందు శని, ఆశ్వయుజ బహుళము, కార్తిక శుక్లములయందు జన్మతార యందు కుజుడు మరియు మార్గశిరమందు కుజవేధ. **స్వాతీ** నక్షత్రము వారికి శ్రావణ బహుళము నుండి సంవత్సరాంతము వరకు నైధనతార యందు కేతువు, వైశాఖ బహుళము అధిక జ్యేష్ఠ శుక్లములయందు, ఆషాఢ బహుళము నుండి భాద్రపద శుక్లము వరకు నైధనతారయందు కుజుడు, కార్తికమునందు కుజవేధ గలదు. **విశాఖ** వారికి పుష్య శుక్లము నుండి సంవత్సరాంతము వరకు జన్మతారలో రాహువు, శ్రావణ బహుళము వరకు నైధనతారయందు కేతువు, అధిక జ్యేష్ఠ బహుళము నుండి ఆషాఢ శుక్లము వరకు మరియు భాద్రపద బహుళము, ఆశ్వయుజ శుక్లములయందు నైధనతారయందు కుజుడు, మార్గశిర శుక్లమునందు జన్మతారలో కుజుడు మరియు ఆశ్వయుజ బహుళము, కార్తిక శుక్లము మరియు ఫాల్గునములందు కుజవేధ కావున ఆయా నక్షత్రముల వారు ఆయా సమయములయందు ఆయా గ్రహములకు శాంతియొనర్చిన మేలు. మొత్తము మీద వీరు ఈ సంవత్సరము పూర్వార్ధమున గురువునకు, కుజునకు, సంవత్సరాంతమున కుజ, రాహు, కేతువులకు శాంతియొనర్చిన మేలు. ఆదిత్య హృదయ పారాయణ, దేవ బ్రాహ్మణ గోపూజ చేసిన మంచిది.

# వృశ్చిక రాశి

## విశాఖ 4వపాదం, అనూరాధ, జ్యేష్ఠ

## (తొ, నా, నీ, నూ, నే, నో, యా, యీ, యూ)

## ఆదాయం : 2, వ్యయం : 14 - రాజపూజ్యం : 5, అవమానం : 2

వీరికి ఈ సంవత్సరమంతయు ద్వితీయ శని అయినందున ధనవ్యయము, తేజోహాని, అకారణ కలహములు బాధించును. ఎల్లప్పుడు కష్టము, కార్యనాశనము, స్వజన విరోధము, పాపచింతన కలుగును. గురువు భాద్రపద బహుళము వరకు వ్యయమందుండును. పిదప జన్మరాశిలో మాఘ మాసము వరకుండును. కావున శుభమూలక ధనవ్యయము, స్థాన భ్రంశము, ప్రాణివిక్రయ దూషణ కలుగును. రాజాగ్రహమునకు గురి అగుట, కీర్తిహాని, ఉద్యోగమునందు, విరోధములు, భయము, బుద్ధిభ్రంశము కలుగును. ఫాల్గునమునందు ద్వితీయ గురువు కనుక కొంత మేరకు పరిస్థితులు అనుకూలించును. యశోవృద్ధియగును. మాఘమాసము వరకు తృతీయ కేతువు, భాగ్యరాహువు కావున ధన, ధాన్య నష్టము, పశు సంపద నష్టము కలుగును. ప్రయాణములయందు క్లేశము కలుగును. మర్యాదాహాని కలుగును. స్వల్ప విరోధములు కలుగును. లాభము, జయము, ప్రోత్సాహము మధ్య మధ్య కలుగును. ఫాల్గునమునందు ద్వితీయ కేతువు అష్టమ రాహువు అయినందున చతుష్పాజ్జంతువుల వలన పీడ, శారీరక, మానసిక శ్రమ, ప్రభుకోపమునకు గురి అగుట జరుగును. అకారణ కలహములు, అపనిందలు కలుగగలవు.

**చైత్రమున** దేహమున బలహానియు, ఎల్లప్పుడు మనఃక్లేశము, బుద్ధిమాంద్యము, మిత్రులతో విరోధము కలుగును. ప్రారంభమున కొంత బాగుండును. ఉత్తరోత్తరా మరింత శ్రమ, కళత్రమూలక వ్యధయూ కలుగును. **వైశాఖమున** ఉత్తరోత్తరా అభివృద్ధియుండును. దుఃఖనాశనము ఇష్టబంధు విరోధము, కష్టము, భయము కలుగును. కొన్ని దీర్ఘకాలిక జటిల సమస్యలు ఉత్తరార్ధమున పరిష్కరించబడును. **అధిక జ్యేష్ఠమున** ఇష్టబంధు సమాగమము, రాజదర్శనము, వ్యవహారములయందు మాట చెల్లుబడియుండును. మనస్సుకు ధైర్యము, విద్యా వ్యాసంగములకు అవకాశము కలుగును. ఉత్తరార్ధమున అననుకూలతయుండును. శ్రమకరము. ఆరోగ్య లోపములు కలుగ గలవు. **నిజ జ్యేష్ఠమున** శరీరమునందు నలత, హృదయమునందు తాపము, భీతి కలుగును. తన చర్యలచే తరచుగనితరులను కష్టబెట్టుటయు, అందుచే గౌరవహాని కలుగును. **ఆషాఢమున** శ్రమ అధికము తరచుగా ఏవో చిక్కులు అధికముగనుండును. ఉత్తరార్ధమున చాలా వరకు సమస్యలు పరిష్కరించబడును. నూతన కార్యములు సత్ఫలితములీయ జాలవు. **శ్రావణమున** కొన్ని వివాదములు, అపనిందలు ఉన్ననూ వైభముగనేయుండును. నూతన పదవీ లాభము, గౌరవము, ఉత్సవములు, సన్మానములు జరుగును.

ఇష్టకార్యర్థ సిద్ధియగును. **భాద్రపదమున** చాలా వరకు మేలుగనే యుండును. బంధువులతో మైత్రి, అందుచే సంతోషము, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. కఠిన వృత్తులు జీవనముగా కలవారు శారీరక ఆరోగ్యముపై శ్రద్ధయుంచవలయును. **ఆశ్వయుజమున** ప్రారంభమున కొంత లాభముగనున్నను, ఉత్తరోత్తర శ్రమకరమగు కాలము. అకాల భోజనములు, అనారోగ్యము, ధనవ్యయము, శ్రమ అధికము, ఫలితము స్వల్పము రీతిగనుండును. **కార్తికమున** కించిత్సుఖము శ్రమ అధికము. దుష్టసాంగత్యముచే కష్టములు. భాగ్యము తగ్గును. భయము కలుగును. బంధువైరము పెరుగును. ఆరోగ్య లోపములు బాధించును. **మార్గశిరమున** సాధు సజ్జనులలో వైరము, పాపకర్మలయందాసక్తి దుష్టసాంగత్యము, ధన లోపములు కలుగును. జాగ్రత్త అవసరము. **పుష్య మాసమున** బాధలు చాలా వరకు ఉపశమించును. దోషములు సవరించుకొనును. ధనలాభము, మాట గౌరవము, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. బంధుమిత్రుల సహకారముండును. **మాఘ మాసమున** సర్వము అనుకూలించును. ధనధాన్య వస్త్ర లాభము, భూగృహ సంపాదన కలుగును. పుణ్యకార్యములయందాసక్తి కలుగును. ఉత్సాహము, భార్యాపుత్రాది స్వజనులతో అనురాగము వలన ఆనందము కలుగును. **ఫాల్గునమున** శుభాశుభ మిశ్రమము. చాలా వరకు కార్యములయందు సంతృప్తికరమయిన ముగింపు రాదు. పూర్వార్ధమున కొంత అనుకూలమయిన కాలము. ఉత్తరార్ధమున విద్యా విషయములకు అనుకూలము.

**విశాఖ** వారికి పుష్య శుక్లము నుండి సంవత్సరాంతము వరకు జన్మతారలో రాహువు, శ్రావణ బహుళము వరకు నైధనతారయందు కేతువు, అధిక జ్యేష్ఠ బహుళము నుండి ఆషాఢ శుక్లము వరకు మరియు భాద్రపద బహుళము, ఆశ్వయుజ శుక్లములయందు నైధనతారయందు కుజుడు, మార్గశిర శుక్లమునందు జన్మతారలో కుజుడు మరియు ఆశ్వయుజ బహుళము, కార్తిక శుక్లములందు మరియు ఫాల్గునమునందు కుజవేధ. **అనూరాధ** వారికి వైశాఖ బహుళము నుండి, మార్గశిర బహుళము వరకు జన్మతారయందు రాహువు మరియు సంవత్సరారంభము నుండి వైశాఖ శుక్లము వరకు రాహువేధ. మార్గశిర బహుళము, పుష్య శుక్లములయందు జన్మతారలో కుజుడు మరియు మాఘ బహుళము, ఫాల్గున శుక్లములందు కుజవేధ. **జ్యేష్ఠ** వారికి వైశాఖ శుక్లము వరకు జన్మతార యందు రాహువు మరియు వైశాఖ బహుళము నుండి మార్గశిర బహుళము వరకు రాహువేధ. కార్తికమునందు నైధనతారయందు కుజుడు, పుష్యమాసమునందు జన్మతారయందు కుజుడు సంచరించును. కావున జాగ్రత్త అవసరము. మొత్తము మీద వీరు ఈ సంవత్సరము శని, గురువులకు, కుజునకు శాంతియొనర్చిన మేలు. దేవబ్రాహ్మణ గోపూజ, విష్ణు సహస్రనామ పారాయణ, ఆదిత్య హృదయ పారాయణ చేయుట మంచిది.

# ధనూరాశి

## మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వపాదము

## (యే, యొ, బా, బి, బూ, ధ, భ, ఢ, బె)

## ఆదాయం : 5, వ్యయం : 5 - రాజపూజ్యం : 1, అవమానం : 5

వీరికి ఈ సంవత్సరమంతయు జన్మరాశిలో శని కనుక విశేషించి శ్రమకరము, కష్టప్రదముగనుండును. వృథా కార్యములయందు అలసట, భార్యాపుత్రాది స్వజన విరోధము, ఆరోగ్యలోపములు బాధించును. తేజోహాని, మతిభ్రంశము, భయము కలుగును. జనన సమయమున శనిబలము బాగున్న అంత బాధలేదు. అయితే భాద్రపద బహుళము వరకు గురువు ఏకాదశమందుండుటచే పరిస్థితులు అనుకూలించును. సంతానవృద్ధి, నూతనకృషి లాభము, గౌరవము, యత్నకార్యసిద్ధియగును. పిదప మాఘ బహుళము వరకు వ్యయ గురువు, ఫాల్గునమున జన్మ గురువు అగుటచే ధనవ్యయము స్థాన చలనము, శ్రమ కలుగును. రాజాగ్రహమునకు గురి అగుట, కీర్తిహాని, ఉద్యోగ భంగము కలుగ గలవు. మాఘ బహుళము వరకు ద్వితీయ కేతువు, అష్టమ రాహువు అయినందున అకారణ కలహములు, అపనిందలు, చతుష్పాజ్జంతువుల వలన పీడ కలుగును. ప్రయాస, శరీరబాధయు కలుగును. రాహు, కేతువులు జనన సమయమున అనుకూలురేని ద్రవ్యలాభము, కీర్తి, సంతోషము కలిగించెదరు.

**చైత్రమున** గృహచ్ఛిద్రములు, సుఖము లేకుండుట, ప్రయాణాదులయందు ఇబ్బందులు కలుగును. శారీరకముగా గాయములు, స్వజన విరోధము కలుగును. ఇవి ఇట్లున్ననూ, స్వబుద్ధితో యోచించిన కార్యములు జయప్రదమగును. విద్యా వ్యాసంగము కొనసాగును. ధనధాన్య వృద్ధియగును. **వైశాఖమున** పూర్వార్ధమున శారీరక శ్రమ, మానసిక వేదన కలుగును. విద్యార్థులకు అనుకూలమయిన కాలము. శత్రుపీడ, జ్ఞాతివైరము, భార్యాపుత్రాది స్వజనులచే కష్టములు కలుగును. **అధిక జ్యేష్ఠమున** చాలా వరకు సుఖ జీవనము, ధనధాన్య లాభము, వ్యాపారమునందు వృద్ధి, యత్న కార్యసిద్ధియగును. గృహమునందు కొన్ని ఇబ్బందులు, కళత్ర పీడయు కలుగును. **నిజ జ్యేష్ఠమునందు** ఇరుగుపొరుగు వారితో కలహములు, మిక్కిలి ద్వేషము, కళత్రపీడ, భోజనహాని, మనోవ్యాకులత ఇట్టి సమస్యలుండును. మరియొక వైపు గొప్పవారితో పరిచయము, తన్మూలకముగా కార్యసాధనయగును. **ఆషాఢమున** దుష్టసాంగత్యము, అందుచే కలుగు కష్టములు బాధించును. అయితే గురుభక్తి, కులదేవతారాధన వలన సమస్యలు తొలగును. మాట అదుపులోనుంచుకొన వలయును. **శ్రావణమున** తనయందపరాధము లేకయే అపనిందలు పొందుట, ద్రవ్యహాని, పుణ్యకార్యములయందు అనాసక్తి, బలహీనతయు కలుగును. కీర్తిహాని కలుగును. ఉత్తరార్ధమున ప్రత్యేకించి మాసాంతమున సుఖము కలుగును. **భాద్రపదమున** ఆకస్మిక ధన యోగము, పదవీ లాభము, గౌరవము, కీర్తి ప్రతిష్ఠలు, పెరుగును. యత్నించిన కార్యములు సిద్ధించుటచే ఉత్సాహము కలుగును.

ఉత్తరోత్తరా వృద్ధి కలుగును. **ఆశ్వయుజమున** చాలా వరకు అనుకూలముగ నుండును. ఉత్తరార్ధమున మాత్రము కొంత జాగ్రత్త అవసరము. ప్రభు కోపము, ధనవ్యయమగును. **కార్తికమున** దీర్ఘకాలికముగా ఉన్న ఇబ్బందులు తొలగును. కొన్ని సమస్యలు, అపనిందలు కలిగిననూ బాగుండును. **మార్గశిరమున** పూర్వార్ధమున చాలా వరకు అనుకూలముగ గడచును. అభివృద్ధి, ఆనందము కలుగును. ఉత్తరార్ధమున శారీరక, మానసిక శ్రమ, అలసత్వము, ప్రయాణాదులయందు ఇబ్బందులు కలుగును. **పుష్య మాసమున** ప్రయాణాదులయందు ఇబ్బందులు కొనసాగును. పూర్వార్ధమున దుష్టసాంగత్యము చేత ఇబ్బందులు కలిగిననూ, ఉత్తరార్ధమున ధనలాభము, ఐశ్వర్యప్రాప్తి కలుగును. మొత్తము మీద కొంత శ్రమకరమయిన కాలము. ఆరోగ్య లోపములు బాధించును. **మాఘ మాసమున** చాలా వరకు ప్రశాంతముగనుండును. తలచిన కార్యములు నెరవేరును. ధనలాభము, శుభకార్యములయందు ధనవ్యయము, మధ్యమధ్యలో పాపకర్మాసక్తి, అంతలో పశ్చాత్తాపము కలుగును. మిత్రులచే కొన్ని కార్యములు సానుకూలపడును. **ఫాల్గునమున** ప్రారంభమున ఉచ్ఛస్థితి, మధ్య ప్రాంతమున సామాన్య స్థితి, ఉత్తరార్ధమున తిరిగి ఉచ్ఛస్థితియుండును. ఉత్తరార్ధమున వర్తక, వాణిజ్యాదులు, కృషియందు నష్టము కనుక జాగ్రత్త అవసరము.

**మూలా** నక్షత్రము వారికి అధిక జ్యేష్ఠ బహుళము నుండి కార్తిక బహుళము వరకు జన్మనక్షత్రమునందు శని, పుష్య శుక్లము నుండి సంవత్సరాంతము వరకు నైధనతారయందు రాహువు మరియు రాహువేధ గలదు. చైత్ర శుక్లమునందు జన్మనక్షత్ర కుజుడు, మాఘమునందు జన్మతారయందు కుజుడు సంచరించును. **పూర్వాషాఢ** వారికి అధిక జ్యేష్ఠ బహుళము వరకు, తిరిగి కార్తిక బహుళము నుండి సంవత్సరాంతము వరకు జన్మ నక్షత్రమునందు శని, వైశాఖ బహుళము నుండి మార్గశిర బహుళము వరకు నైధనతారయందు రాహువు, చైత్ర బహుళం వైశాఖ శుక్లములందు జన్మనక్షత్రమునందు కుజసంచారము, మాఘ బహుళము, ఫాల్గున శుక్లములందు జన్మతారయందు కుజుడు, మార్గశిర బహుళము, పుష్య శుక్లముల యందు నైధనతారయందు కుజుడు సంచరించును. **ఉత్తరాషాఢ** వారికి వైశాఖ శుక్లము వరకు నైధనతారయందు రాహువు, శ్రావణ బహుళము నుండి సంవత్సరాంతము వరకు జన్మ నక్షత్రమందు కేతువు, వైశాఖ బహుళము అధిక జ్యేష్ఠ శుక్లము, మరియు ఆషాఢ బహుళము నుండి భాద్రపద శుక్లము వరకు జన్మ నక్షత్రమునందు కుజుడు సంచరించును. పుష్య బహుళమునందు నైధనతార యందు కుజుడు సంచరించును. కావున జాగ్రత్త అవసరము. బహు జాగ్రత్తగ గానీ ఏపనీ చేయరాదు. ముఖ్యముగా ధనూరాశియందు శని-కుజ (చైత్ర), శని-కేతు-గురు యోగము (ఫాల్గునము) కావున అత్యంత జాగ్రత్తగనుండవలయును. వీరు ఈ సంవత్సరము శని రాహు కేతువులకు, కుజునకు ఉత్తరార్ధమున గురువునకు యథాశక్తిగా శాంతియొనర్చవలయును. మరియు ప్రతినెలా జన్మనక్షత్రము నాడు, ఏకాదశి నాడు, మాస శివరాత్రి నాడు పరమేశ్వర ప్రీతిగ అభిషేకము, హనుమత్పూజా ప్రదక్షిణాదులు, సుందరకాండ పారాయణ చేయుటచే సర్వారిష్టములు తొలగును.

# మకర రాశి

## ఉత్తరాషాఢ 2, 3, 4 పాదములు, శ్రవణ, ధనిష్ఠ 1, 2 పాదములు (బో, జా, జీ, జూ, జే, జో, ఖ, గ, గీ)

## ఆదాయం : 8, వ్యయం : 14 - రాజపూజ్యం : 4, అవమానం : 5

వీరికి ఈ సంవత్సరమంతయు వ్యయశనియగుటచే జాగ్రత్త అవసరము. ఆరోగ్య లోపములు బంధు వైరములు, గృహచ్ఛిద్రములు బాధించును. వృధావ్యయములు కలుగును. వ్యవసాయమునందు నష్టమెక్కువ. మానసిక అశాంతి అధికముగనుండును. వాదనలకు చోటివ్వరాదు. భాద్రపద బహుళము వరకు దశమ గురువు అయినందున వృత్తి, ఉద్యోగ వ్యాపారాదులయందు చిక్కులు, ఆస్తినష్టం, సంతతి పీడ, గౌరవభంగము, వృధా ప్రయాణములు, స్వజన విరోధము కలుగ గలవు. పిమ్మట ఆశ్వయుజ శుక్లము నుండి మాఘ బహుళము వరకు ఏకాదశ గురువు అగుటచే చాలా వరకు చిక్కులు తొలగును. పరిస్థితులు అనుకూలించును. కీర్తివృద్ధి, బలము, తేజస్సు, ఎల్ల చోట్ల జయము, సుఖము, విరోధి నాశనము, మంత్రసిద్ధి కలుగును. ఫాల్గునమునందు ద్వాదశ గురువు కావున అపనిందలు, ధనవ్యయము కలుగును. మాఘ బహుళము వరకు జన్మకేతువు, సప్తమ రాహువు అయినందున భార్యాపుత్రాది స్వజన విరోధము, దేశ సంచారము, రోగబాధలు, కలహము, అపనిందలు, వ్యవసాయములో నష్టము, చతుష్పాజ్జంతువుల వలన పీడ, వృధా ప్రయాణాదుల యందు అలసట కలుగును. ఫాల్గునమునందు షష్ఠరాహువు ద్వాదశ కేతువు కనుక కొంత ఉపశమనముగనుండును. సంతోషము, జయము, ప్రోత్సాహము కలుగును.

**చైత్రమున** శారీరక శ్రమలు తొలగి సుఖముగనుండును. ఉత్సాహము, ఉల్లాసము, బంధుమిత్రులతో సమాగమము, ఇష్టకార్యార్థసిద్ధి, విద్యా వ్యాసంగము కొనసాగును. **వైశాఖమున** గృహచ్ఛిద్రములు, సౌఖ్యము తక్కువ. ప్రయాణముల యందు విఘ్నములు, బంధువిరోధము, ఆర్థికముగ బాగుండును. భృత్యవృద్ధి కలుగును. ఉత్తరార్థము నుండి ఆరు మాసములు జన్మరాశిలో కుజుడు సంచరించును కావున గాయములు, జ్వరములు, స్వజన విరోధము, పీడయధికముగనుండును. ఆరోగ్యమును జాగ్రత్తగా చూసుకొనవలయును. క్లిష్టమయిన కార్యములయందు సాహసము చేయరాదు. **అధిక జ్యేష్ఠమున** శ్రమ అధికము. ఫలితము స్వల్పము. శారీరక, మానసిక అలసత్వము బుద్ధిమాంద్యము, శత్రుజ్ఞాతి పీడలు, స్వజన విరోధము కలుగును. **నిజ జ్యేష్ఠమున** యత్న కార్యసిద్ధియగును. శారీరక సుఖము లభించును. ధన ధాన్య వస్త్ర లాభము కలుగును. ధైర్యము కలుగును. ఉత్తరార్థమున ప్రభుకోపము, స్త్రీమూలక వ్యధ కలుగును. **ఆషాఢమున** పొరుగు వారితో ద్వేషము, కలహములు, ఉత్సాహ భంగము, భార్యకు పీడయు, ప్రభుకోపము కలుగును. పూర్వార్థమున సమస్యలు తక్కువ. ఉత్తరార్థము శ్రమకరము. పూర్వార్థమున రాజదర్శనము, ద్రవ్యలాభము, ఉత్తరార్థమున దేవ బ్రాహ్మణ గురుభక్తియు కలుగును. **శ్రావణమున** శారీరరక బాధలు, హృదయ దౌర్బల్యము, అధిక ప్రయాణముల వలన అలసట, ఆందోళనలు కలుగును. భయము, స్వల్ప భోజనములు కలుగును.

మనస్తాపము కలుగును. **భాద్రపదమున** బలహాని, శరీరమున నిస్సత్తువ, ఆందోళన, ద్రవ్యనాశనము, శత్రువృద్ధి కలుగును. తనయందు దోషము లేకనే ధన వ్యయము, అపనిందలు కలుగును. **ఆశ్వయుజమున** పూర్వార్ధము కన్నా ఉత్తరార్ధము లాభదాయకము. సౌఖ్యదాయకము. పూర్వార్ధమున కృషి వాణిజ్యములు కలసిరావు. ఉత్తరోత్తరా లాభకరముగనుండును. **కార్తికమున** ఇష్టబంధు సమాగమము, గొప్పవారితో పరిచయము ద్రవ్యలాభము కులదేవతారాధన, శుభ కార్యానుకూలత యుండును. వృత్తి వ్యాపారాదులయందు సాధారణము కంటే అధికమయిన శ్రద్ధయుంచిన లాభము కలుగును. **మార్గశిరమున** ప్రారంభమున అంతయు అనుకూలము, కాగా మధ్యమధ్యలో బలహాని, ధనవ్యయము, ఆశించిన ఫలితము నెరవేరకయుండును. **పుష్య మాసమున** కించిత్సుఖం, కించిదుఃఖము, కించిత్ లాభము, శారీరక శ్రమ, ఉదర జఠర సంబంధ సమస్యలు కలుగును. దీర్ఘకాలిక సమస్యలు కొన్ని పరిష్కరించబడును. **మాఘ మాసమున** సేద్యము, వర్తక వ్యాపారాదులయందు ఆశించిన లాభములుండవు. సత్పురుషులతో గోష్ఠి, సుఖము, ధనలాభము, యత్నకార్యసిద్ధి కలుగును. ప్రయాణాదులయందు ఇబ్బందులు, భయము, బంధు విరోధము కలుగును. ఆరోగ్య లోపములు కలుగును. **ఫాల్గునమున** కొంత శ్రమకరముగనున్నను ఉత్తరోత్తరా వృద్ధి, ధనలాభము, ఋణవిముక్తి, భూగృహ సంపాదన జరుగును. మనస్సుకు సంతోషము, ఒకప్పుడు అత్యుత్సాహముచే, పాప కార్యములయందు ప్రవర్తించుట జరుగును. కావున జాగ్రత్త అవసరము.

**ఉత్తరాషాఢ** వారికి వైశాఖ శుక్లము వరకు నైధనతారయందు రాహువు, శ్రావణ బహుళము నుండి సంవత్సరాంతము వరకు జన్మ నక్షత్రమునందు కేతువు, వైశాఖ బహుళము, అధిక జ్యేష్ఠ శుక్లము మరియు, ఆషాఢ బహుళము నుండి భాద్రపద శుక్లము వరకు జన్మనక్షత్రమునందు కుజుడు సంచరించును. పుష్య బహుళమునందు నైధనతారయందు కుజుడు సంచరించును. **శ్రవణా** నక్షత్రము వారికి అధిక జ్యేష్ఠ బహుళము నుండి కార్తిక బహుళము వరకు నైధనతారయందు శని, శ్రావణ బహుళము వరకు జన్మనక్షత్రమునందు కేతువు, అధిక జ్యేష్ఠ బహుళము, ఆషాఢ శుక్లము మరియు భాద్రపద బహుళము నుండి ఆశ్వయుజ శుక్లము వరకు జన్మనక్షత్రమునందు కుజుడు, చైత్ర శుక్లమునందు మరియు, మాఘ మాసమునందు నైధనతారయందు కుజుడు సంచరించును. ఫాల్గునమునందు కుజవేధ గలదు. **ధనిష్ఠ** వారికి అధిక జ్యేష్ఠ బహుళము వరకు తిరిగి కార్తిక బహుళము నుండి సంవత్సరాంతము వరకు నైధనతారయందు శని, వైశాఖ శుక్లము వరకు రాహువేధ, ఆశ్వయుజ బహుళము, కార్తిక శుక్లములందు జన్మనక్షత్రమునందు కుజుడు, చైత్ర బహుళము, వైశాఖ శుక్లములయందు, మాఘ బహుళము, ఫాల్గున శుక్లములయందు నైధనతారయందు కుజ సంచారము కనుక జాగ్రత్త అవసరము. ముఖ్యముగా వైశాఖ బహుళము నుండి జన్మరాశిలో ఆరు మాసములు కుజ–కేతు యోగమున్నది కావున అత్యంత జాగ్రత్త అవసరము. యథాశక్తిగ ఆయా గ్రహములకు శాంతి చేయవలయును. శివ కేశవులను యథాశక్తిగా పూజించుటతో పాటు సప్తశతీ పారాయణ చేయించుకొనవలయును. సుబ్రహ్మణ్య, గణపతులను ఆరాధించుటచే దోషము తొలగి ప్రశాంతత నొందగలరు.

# కుంభ రాశి

## ధనిష్ఠ 3, 4 పాదములు, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3 పాదములు
## (గు, గె, గో, స, సి, సు, సె, సొ, దా)
## ఆదాయం : 8, వ్యయం : 14 - రాజపూజ్యం : 7, అవమానం : 5

వీరికి ఈ సంవత్సరమంతయు లాభశనియగుటచే అంతయు అనుకూలించును. లాభము, జయము, ప్రోత్సాహము, సకల కార్యములయందు జరుగును. ఆరోగ్యము, ద్రవ్యలాభము, భార్యాపుత్రాది స్వజనలాభము, సర్వకార్యసిద్ధియగును. భాద్రపద బహుళము వరకు భాగ్య గురువు కావున గౌరవ మర్యాదలు కీర్తి ప్రతిష్ఠలు కలుగును. సకల కార్యములయందు అనుకూలతయుండును. గృహలాభము, మంచిభోజనము సమకూరును. ఆశ్వయుజ శుక్లము నుండి మాఘ బహుళము వరకు దశమ గురువు అయినందున వృత్తి ఉద్యోగ వ్యాపారాదులయందు తరచుగ చిక్కులు, ఆస్తి నష్టం, సంతతి పీడ, గౌరవ భంగము కలుగవచ్చును. స్వజన విరోధము, వ్యవసాయమునందు నష్టము వ్యర్థ సంచారము కలుగును. మాఘ బహుళము వరకు షష్ఠరాహువు, వ్యయ కేతువు అయినందున సకల కార్యములయందు ధైర్యము, విజయము కలుగును. శత్రుజయమగును. గో భూ లాభము కలుగును. ఆదాయమునకు మించి వ్యయము వలన కొన్ని సమస్యలు అందుచే కార్యములయందు విఘ్నములు కలుగును. ఫాల్గునమునందు లాభ కేతువు, పంచమ రాహువు అగుటచే పుత్రులతో విరోధము సమస్యలు ఉన్నను చాలావరకు లాభము, జయము, ప్రోత్సాహము కలుగును. చాలావరకు బాగుండును.

**చైత్రమున** స్వల్ప అవరోధము కలిగినను, సమస్త కార్యములయందు జయము, లాభము, ప్రోత్సాహము కలుగును. కీర్తి ప్రతిష్ఠలు కలుగును. వస్త్రలాభము కలుగును. సత్పురుషులతో పరిచయము, మైత్రి కలుగును. ధనలాభము కలుగును. ధైర్యము, యత్న కార్యసిద్ధియగును. **వైశాఖమున** పూర్వార్ధమంతయూ బాగుగా నుండును. సత్కార్యములు, సత్కీర్తి కలుగును. ఉత్తరార్ధమున శారీరక పీడ, బంధు ద్వేషము కలుగవచ్చును. వాహన యోగము, స్వీయబుద్ధితో చేసిన పనులు ఫలించుటయు జరుగును. విద్యా వ్యాసంగము కలుగును. **అధిక జ్యేష్ఠమున** భృత్యవృద్ధి, ఇష్టార్థ లాభము కలుగును. బంధు ద్వేషము, బుద్ధిమాంద్యము కలుగును. ఉత్తరార్ధమున ధన ధాన్య వృద్ధి కలుగును. గృహచ్ఛిద్రములు ప్రయాణములయందు ఇబ్బందులు కలుగును. **నిజ జ్యేష్ఠమున** శుభాశుభ మిశ్రమమున కించిత్ శ్రమ అధికము. శరీరమున నలత, హృదయమునందు సంకటము, ద్రవ్య వ్యయము అగును. అనారోగ్యము కలుగవచ్చును. శత్రుజ్ఞాతి పీడ కలుగును. **ఆషాఢమున** మంచి సుఖము, ప్రయత్నించిన కార్యములు నెరవేరుట, ధన ధాన్య వస్త్ర లాభము కలుగును. విద్యాపరముగా చేయు ప్రయత్నములు ఫలిస్తాయి. తొందరగా కోపించు గుణము వలన ఇబ్బందులు వచ్చును. **శ్రావణమున** పూర్వార్ధమంతయు మిక్కిలి శోభ, శుభకార్యానుకూలత దుఃఖనాశనము, ఇష్టబంధు సమాగమము,

రాజదర్శనము, ద్రవ్యలాభము కలుగును. ఉత్తరార్ధమున భార్యాబిడ్డల ఆరోగ్యలోపముచే ఉత్సాహ భంగమగును. పొరుగు వారిచే భీతి కలుగును. **భాద్రపదమున** శత్రువులతో వాదము, అందుచే చిక్కులు, ప్రయాణాదులయందు కష్టములు, వ్యసనపు వాక్యములు వినుటయు కలుగును. శరీరము జడమగుట, అందుచే ఉత్సాహము కోల్పోవుట, వ్యాధితాపము కలుగును. మధ్యమధ్య స్వధర్మాచరణచే ఆరోగ్యము, ఆనందము కలుగును. **ఆశ్వయుజమున** పరిస్థితులు అంతగా అనుకూలించవు. ప్రతి పనిని కడు జాగ్రత్తగా చేయవలయును. లేనిచో అపనిందలు, పశ్చాత్తాపము కలుగును. **కార్తికమున** శుభాశుభ మిశ్రమముగ నుండును. గాయములు, వ్రణములు, శారీరకపీడ, బంధువులతో వైరము కలుగును. నూతన పదవీగౌరవము, ధనలాభము, రాజదర్శనము, సౌఖ్యము కలుగును. మొత్తము మీద కొంచెము జాగ్రత్తగనున్న శుభము జరుగును. **మార్గశిరమున** పూర్వార్ధము కన్నా ఉత్తరార్ధము మేలు. మొత్తము మీద గతము కంటే బాగుండును. **పుష్య మాసమున** పూర్వార్ధము మిక్కిలి అనుకూలము. శుభయత్నములు ఫలిస్తాయి. ద్రవ్యలాభము, సంతోష సౌఖ్యములు కలుగును. కీర్తిప్రతిష్ఠలు, మైత్రి కలుగును. ఉత్తరార్ధమున మనస్సున ఆందోళన, కలహములు జరుగును. **మాఘమున** అంతయూ అనుకూలముగనుండును. అట్లని అహంకరించరాదు. చెడు సహవాసములు ఇబ్బందులను సృష్టించును. మొత్తము మీద బాగుండును. అందరితో సఖ్యముగనుండవలయును. **ఫాల్గునమున** శుభాశుభ మిశ్రమముగనుండును. వర్తక, వాణిజ్య, వ్యవసాయములయందు లాభము పరిమితము. ఉత్తరార్ధమున భయము కలుగును. పూర్వార్ధమున కొంత లాభము, కొంత విఘ్నము. ఉత్తరార్ధమున ధనప్రాప్తి ఆరోగ్యము కలుగును.

**ధనిష్ఠ** వారికి అధిక జ్యేష్ఠ బహుళము వరకు తిరిగి కార్తిక బహుళము నుండి సంవత్సరాంతము వరకు నైధనతారయందు శని, వైశాఖ శుక్లము వరకు రాహువేధ. ఆశ్వయుజ బహుళము, కార్తిక శుక్లములందు జన్మనక్షత్రమునందు కుజుడు, చైత్ర బహుళము, వైశాఖ శుక్లముయలందు, మాఘ బహుళము, ఫాల్గున శుక్లములయందు నైధనతారయందు కుజుడు సంచరించును. **శతతార** వారికి శ్రావణ బహుళము నుండి సంవత్సరాంతము వరకు నైధనతార యందు కేతువు సంచరించును. వైశాఖ బహుళము, అధిక జ్యేష్ఠ శుక్లములయందు, ఆషాఢ బహుళము నుండి భాద్రపద శుక్లము వరకు, ఫాల్గునమునందు నైధనతారయందు కుజుడు, కార్తికమునందు జన్మ నక్షత్రమునందు కుజుడు సంచరించును. **పూర్వాభాద్ర** వారికి పుష్యశుక్లము నుండి సంవత్సరాంతము వరకు జన్మతారయందు రాహువు, శ్రావణ బహుళము వరకు నైధనతారయందు కేతువు, అధిక జ్యేష్ఠ బహుళము, ఆషాఢ శుక్లము వరకు మరియు భాద్రపద బహుళము నుండి ఆశ్వయుజ శుక్లము వరకు నైధనతారయందు కుజుడు, మార్గశిరమునందు జన్మ నక్షత్రమునందు కుజుడు సంచరించును. కావున ఆయా రాశులవారు ఆయా సమయములయందు ఆయా గ్రహములకు శాంతియొనర్చిన మేలు. మొత్తము మీద వీరు ఈ సంవత్సరము కుజునకు, ఉత్తరార్ధమున గురువునకు శాంతియొనర్చిన మేలు. గురుసేవ, సుందరకాండ పారాయణ వలన సర్వ కార్యార్థసిద్ధియగును.

# మీన రాశి

## పూర్వాభాద్ర 4వపాదము, ఉత్తరాభాద్ర, రేవతి

## (ది, దు, శం, ఝ, ధ, దె, దొ, చ, చి)

## ఆదాయం : 5, వ్యయం : 5 - రాజపూజ్యం : 3, అవమానం : 1

వీరికి ఈ సంవత్సరమంతయు శని దశమమందుండుటచే ఉద్యోగ విఘ్నము, పాపకార్యాసక్తి, వ్యవసాయమునందు నష్టము, వ్యాకులత, దుఃఖము కలుగును. భాద్రపద బహుళము వరకు అష్టమగురువు అయినందున పరిస్థితులు అనుకూలించవు. చోర బాధలు, అగ్ని బాధలు, రాజ బాధలు కలుగును. అపనిందలు, భయము, గౌరవ హాని కలుగును. శరీరమునందు అలసట కలుగును. పిమ్మట ఆశ్వయుజము నుండి మాఘ మాసము వరకు భాగ్య గురువు అయినందున పరిస్థితులు చాలావరకు అనుకూలించును. గౌరవ మర్యాదలు, కీర్తిప్రతిష్ఠలు కలుగును. సకల కార్యములయందు సానుకూలతయుండును. గృహలాభము కలుగును. మాఘ బహుళము వరకు ఏకాదశ కేతువు, పంచమ రాహువు అగుటచే కొంత లాభము, జయము, ప్రోత్సాహము, సన్మానము జరుగును. అకాల భోజనములు చేయరాదు. పశులాభము కలుగును. పుత్రమూలక వ్యధ కలుగును. ఫాల్గునమునందు చతుర్థ రాహువు, దశమ కేతువు కావున కించిత్సుఖము, చిత్త చాంచల్యము, వాత రోగములు ప్రయాణాదులయందు ఇబ్బంది కలుగును.

**చైత్రమున** ఆరోగ్య లోపములు, శారీరక శ్రమ, బంధు మిత్రులతో వైరము కలుగును. అకాల భోజనములు, ఉద్యోగాదులయందు మిక్కిలి శ్రమ కలుగును. ఉత్తరార్థమున భార్యాపుత్రాది స్వజనము వలన సంతోషము, సుఖము కలుగును. **వైశాఖమున** వర్తకమూలక ధనవ్యయము, శత్రువృద్ధి, బుద్ధివైకల్యము వలన చెడు సహవాసము, తగాదాలు కలుగును. **అధిక జ్యేష్ఠమున** సకల కార్యములయందు జయము కలుగును. ఆరోగ్యము చేకూరును. బంధుమిత్రులతో సమావేశములు, ధనప్రాప్తి, ప్రయత్నించిన కార్యములయందు జయము కలుగుటచే ఉత్సాహము కలుగును. విద్యా విషయములయందు వృద్ధియుండును. ఉత్తరార్థమున కొన్ని విఘ్నములు కలుగును. **నిజ జ్యేష్ఠమున** ధనధాన్య వృద్ధియుండును. ఆత్మబుద్ధిచే చేయు కార్యములు సఫలమవుతాయి. ఉష్ణతాపము, ప్రయాణాదులయందు శ్రమ, గృహచ్ఛిద్రములు బాధించును. మాసాంతమున విరోధము, శత్రుజ్ఞాతి బాధలు కలుగును. **ఆషాఢమున** సర్వము వ్యతిరేకముగ తోచును. భార్యాపుత్రాది స్వజన విరోధము, మానసిక ప్రశాంతత లోపించును. కొంచెము జాగ్రత్తగా గాని ఏపనీ చేయరాదు. **శ్రావణమున** ప్రారంభమున పరిస్థితులు విషమముగనున్నను, ఉత్తరోత్తరా అనుకూలించును. సుఖసంతోషము కలుగును. యత్న కార్యసిద్ధిచే ఉత్సాహము, ధన ధాన్య లాభము కలుగును. **భాద్రపదమున** ప్రారంభమున అనుకూలతయున్నను మధ్యమధ్య పొరుగు వారితో వివాదము, శత్రుభీతి కలుగును. ద్రవ్యనాశనము, ప్రభుకోపము కలుగును. ద్రవ్యలాభము, రాజదర్శనము, కొంచెము జాగ్రత్తగానున్నచో కలుగును. **ఆశ్వయుజమున** పూర్వార్థము వరకు కొంత సుఖముగ

ఉన్నను ఉత్తరార్ధము పరిస్థితులు అనుకూలించవు. సాహస కృత్యములు మానవలయును. ప్రవాసము, ధన నష్టము, శారీరక పీడ, ఆరోగ్య లోపములు కలుగును. **కార్తికమున** పరిస్థితులు అనుకూలించవు. ధన వ్యయము, అకారణ కలహములు, అపనిందలు కలుగును. వ్యసనమునందు ఉత్సాహముచే ధననాశనము, పుణ్య నాశనము, కీర్తినాశనము కలుగును. అప్పులు దూరమగుదురు. **మార్గశిరమున** శుక్లమునందు అంతగా అనుకూలించకున్నను, మధ్య ప్రాంతము నుండి వ్యవహారాదులయందు జయము కలుగును. కొంత వైభవము కలుగును. **పుష్య మాసమున** గాయములు, వ్రణములు, శారీరక పీడ, భార్యాపుత్రాది స్వజన విరోధము, అపనిందలు, విఘ్నములు ఎదురగును. ఇష్టదేవతా ప్రార్థన, గురుభక్తి వలన నూతన పదవీ గౌరవము కలుగవచ్చును. **మాఘమున** శరీరము కొంత బలము తగ్గినను కొన్ని విషయములయందు చిక్కులు తొలగినందున ప్రశాంతముగనుందురు. ఉత్తరార్ధమున సౌఖ్యము, సంతోషము కలుగును. **ఫాల్గునమున** పూర్వార్ధమున అర్థలాభము, కీర్తి, అయత్న కార్యసిద్ధి. ఉత్తరార్ధమున చోరరోగ బాధలు, భీతి కలుగును. అయిననూ ఆరోగ్యము, అయత్నముగ ధనప్రాప్తి, వస్త్ర లాభము కలుగును.

**పూర్వాభాద్ర** వారికి పుష్య శుక్లము నుండి సంవత్సరాంతము వరకు జన్మతారయందు రాహువు, శ్రావణ బహుళము వరకు నైధనతారయందు కేతువు, అధిక జ్యేష్ఠ బహుళము, ఆషాఢ శుక్లము వరకు మరియు భాద్రపద బహుళము నుండి ఆశ్వయుజ శుక్లము వరకు నైధనతారయందు కుజుడు, మార్గశిరమునందు జన్మనక్షత్రమునందు కుజుడు సంచరించును. **ఉత్తరాభాద్ర** వారికి వైశాఖ బహుళము నుండి మార్గశిర బహుళము వరకు జన్మతారయందు రాహువు సంచరించును. మార్గశిర బహుళము, పుష్య శుక్లములయందు జన్మ నక్షత్రమునందు కుజుడు, ఆశ్వయుజ బహుళము, కార్తిక శుక్లములయందు నైధనతారయందు కుజుడు సంచరించును. **రేవతి** వారికి వైశాఖ శుక్లము వరకు జన్మతారయందు రాహువు, పుష్య బహుళమునందు జన్మ నక్షత్రమునందు కుజుడు సంచరించును. కార్తికమునందు నైధనతారయందు కుజుడు సంచరించును కావున జాగ్రత్త అవసరము. కావున ఆయా సమయములయందు ఆయా గ్రహములకు శాంతియొనర్చిన మేలు. మొత్తము మీద వీరు ఈ సంవత్సరమంతయు శనికి, పూర్వార్ధమున గురువునకు, ఉత్తరార్ధమున కుజునకు శాంతి యొనర్చిన మేలు. ఆదిత్య హృదయ పారాయణము, హనుమత్పూజా ప్రదక్షిణలు, విష్ణు సహస్రనామ పారాయణము వీరికి శ్రేయోదాయకము.



## సూచన

జాతక గ్రహస్థితి, దశాంతర్దశలు, వామ పార్శ్వ సుముఖ వేధలు మరియు అష్టకవర్గ న్యూనాధిక బిందుఫలములు మొదలగు ఇతర కారణములచే స్థూలంగా సూచించబడిన ఈ ఫలితములు ఈషద్వైషమ్యముగా మాత్రమే ఫలించును. నవగ్రహ బలాబలములచే ఇందు కొంత మార్పు కలుగును.



# సుముహూర్తములు

ఈ సంవత్సరము ఉత్తమ ముహూర్తమలు నిర్దుష్టములగునవి అతి స్వల్పము. మీన చైత్రమందు ఉపనయనము చేయవచ్చును. కాని అష్టమ శుద్ధి కలిగినవి. కేంద్ర పాపగ్రహ వర్జితమగునట్టి ముహూర్తములు లేవు. వివాహాదులు పనికిరావు. ముహూర్తముల గుణదోషాధిక్యములను సూక్ష్మముగా పరిశీలించు సమయమున ఆయా తిథులయందు పాపగ్రహ క్రాంత విద్ధ లత్తలుగా పేర్కొనబడిన నక్షత్రములను పరిత్యజించుట ఉత్తమము. విజ్ఞులు నీర క్షీర న్యాయమున గ్రహించ ప్రార్థితులు.

## చైత్రమాసము

18-03-18 చైత్ర శుక్ల ౧ ఆదివారము ఉత్తరాభాద్రాయుక్త వృషభలగ్నము ఘ ౧౦.౫ ఉ॥ 10.16ని॥ నూతన వస్త్రాభరణధారణాదులు.

24-03-18 చైత్ర శుక్ల ౭ శనివారము మృగశిరాయుక్త మేషము ౭.౩౭ ఉ॥ 8.24ని॥ (మార్తాండ రహితము) అన్నప్రాశనాదులు.

30-03-18 చైత్ర శుక్ల ౧౪ శుక్రవారము ఉత్తరఫల్గునీయుక్త మేషము ౪.౫౦ ఉ॥ 8.00ని॥ (మార్తాండ రహితము) మాసప్రయుక్త కార్యములకు.

31-03-18 చైత్రశుక్ల ౧౫ శనివారము హస్తాయుక్త మేషము ౪.౪౨ ఉ॥ 7.57ని॥ (౬ చంద్రః) మాసప్రయుక్త కార్యములకు.

01-04-18 చైత్ర కృష్ణ ౧ ఆదివారము చిత్రాయుక్త మేషము ౪.౩౦ ఉ॥ 7.54ని॥ (౬ చంద్రః) అన్నప్రాశనాది మాసప్రయుక్త కార్యములకు.

09-04-18 చైత్ర కృష్ణ ౯ సోమవారము ఉత్తరాషాఢాయుక్త మేషము ౩.౩౦ ఉ॥ 7.21ని॥ అన్నప్రాశనాదులు.

## వైశాఖమాసము

**రెండు అవమ దినములు ఏర్పడిన వైశాఖ శుక్లము 'క్షయపక్షము' కావున శుభకార్యములకు అర్హము కాదు.**

03-05-18 వైశాఖ కృష్ణ ౩/౪ గురువారము మూలాయుక్త వృశ్చికము ౩౪.౨ రా॥ 7.18 వివాహాదులు, కుంభము ౫౨.౩౬ రా॥ 2.44ని॥, మీనము ౫౪.౨౬ రా॥ 3.28ని॥ వివాహము.

05-05-18 వైశాఖ కృష్ణ ౫/౬ శనివారము ఉత్తరాషాఢాయుక్త కుంభము ౫౨.౨౦ రా॥ 2.38ని॥ వివాహము.

06-05-18 వైశాఖ కృష్ణ ౬/౭ ఆదివారము శ్రవణాయుక్త మీనము ౫౨.౨౦ రా॥ 3.17ని॥ వివాహము.

09-05-18 వైశాఖ కృష్ణ౯/౧౦ బుధవారము శతతారాయుక్త మీనము ౫౩.౩౯ రా॥ 3.8ని॥ (౧౨ చంద్రః) వివాహము.

## నిజ జ్యేష్ఠమాసము

20-06-18 నిజ జ్యేష్ఠ శుక్ల ౭/౮ బుధవారము ఉత్తరఫల్గునీయుక్త మీనము ౪౭.౫౨ రా॥12.42 (౭ చంద్రః) వివాహము.

21-06-18 నిజ జ్యేష్ఠ శుక్ల ౮/౯ గురువారము హస్తాయుక్త సింహము ౧౩.౩౮ ఉ॥11.05ని॥, హస్తాయుక్త మీనము ౪౭.౪౨ రా॥12.38 (౭ చంద్రః) వివాహము.

22-06-18 నిజ జ్యేష్ఠ శుక్ల ౯/౧౦ శుక్రవారము చిత్తాయుక్త సింహము ౧౩.౨౮ ఉ॥11.01ని॥ ఉపనయన వివాహాదులు.

27-06-18 నిజ జ్యేష్ఠ శుక్ల ౧౪/౧౫ బుధవారము మూలాయుక్త మీనము ౪౬.౩౩ రా॥12.16ని॥ వివాహము.

29-06-18 నిజ జ్యేష్ఠ కృష్ణ ౧/౨ శుక్రవారము ఉత్తరాషాఢాయుక్త మేషము ౫౨.౧౫ రా॥2.33ని॥ వివాహము.

30-06-18 నిజ జ్యేష్ఠ కృష్ణ ౨ శనివారము ఉత్తరాషాఢాయుక్త సింహము ౧౨.౧౦ ఉ॥10.31 (సగ్రహ చంద్రః ౬ చంద్రః) వివాహాదులు.

01-07-18 నిజ జ్యేష్ఠ కృష్ణ ౩ ఆదివారము శ్రవణాయుక్త సింహం ౧౨.౧౦ ఉ॥10.28 (సగ్రహ ౬ చంద్రః) వివాహాదులు.

02-07-18 నిజ జ్యేష్ఠ కృష్ణ ౪ సోమవారము ధనిష్ఠాయుక్త సింహము ౧౧.౫౦ ఉ॥10.24 ఉపనయనము.

05-07-18 నిజ జ్యేష్ఠ కృష్ణ ౭/౮ గురువారము ఉత్తరాభాద్రాయుక్త కుంభము ౪౩.౨౧ రా॥11.1ని॥ వివాహాదులు.

## శ్రావణమాసము

15-08-18 శ్రావణ శుక్ల ౪/౫ బుధవారము హస్తాయుక్త మీనము ౩౭.౫౮ రా॥9.4 (౭ చంద్రః) వివాహాదులు.

16-08-18 శ్రావణ శుక్ల ౫/౬ గురువారము చిత్రాయుక్త కన్య ౮.౧౨ ఉ॥910ని॥ (రాజపంచకము) వివాహదులు.

19-08-18 శ్రావణ శుక్ల ౯ ఆదివారము అనూరాధాయుక్త కన్య ౭.౪౦ ఉ॥8.57ని॥ (మార్తాండ రహితము) వివాహ గృహారంభాదులు, తుల ౧౪.౩౯ ఉ॥11.45ని॥ వివాహము, మీనము ౩౭.౨౨ రా॥8.50ని॥ వివాహము.

25-08-18 శ్రావణ శుక్ల ౧౪/౧౫ ధనిష్ఠాయుక్త మీనము ౩౬.౧౯ రా॥8.26ని॥ వివాహాదులు (౭ శుక్రః).

26-08-18 శ్రావణ శుక్ల ౧౫ ఆదివారము ధనిష్ఠాయుక్త కన్య ౬.౨౬ ఉ॥8.29ని॥ వివాహాదులు (౬ చంద్రః).

27-08-18 శ్రావణ కృష్ణ ౧ సోమవారము శతతారాయుక్త కన్య ౬.౧౬ ఉ॥8.25ని॥ (౬ చంద్రః), తుల ౧౩.౧౫ ఉ॥11.12ని॥ గృహారంభము.

29-08-18 శ్రావణ కృష్ణ ౩ బుధవారము ఉత్తరాభాద్రాయుక్త కన్య ౫.౫౪ ఉ॥8.17ని॥ (౭చంద్రః), తుల ౧౨.౫౫ ఉ॥11.4ని॥ (౬ చంద్రః) వివాహ గృహారంభాదులు.

30-08-18 శ్రావణ కృష్ణ ౪ గురువారము రేవతీయుక్త తుల ౧౨.౪౫ ఉ॥11.00ని॥
(౬ చంద్రః) వివాహ గృహారంభాదులు,
౫ అశ్వినీయుక్త మీనం ౩౪.౩౦ రా॥7.43ని॥ వివాహాదులు.

## ఆశ్వయుజమాసము

11-10-18 ఆశ్వయుజ శుక్ల ౨/౩ గురువారము స్వాతీయుక్త తుల ౫.౨౫ ఉ॥8.10ని॥.

13-10-18 ఆశ్వయుజ శుక్ల ౪/౫ శనివారము అనూరాధాయుక్త తుల ౫.౧ ఉ॥8.1ని॥.

15-10-18 ఆశ్వయుజ శుక్ల ౫ ఆదివారము మూలాయుక్త తుల ౪.౪౦ ఉ॥7.53ని॥.

02-11-18 అశ్వయుజ కృష్ణ ౯/౧౦ శుక్రవారము మఘాయుక్త వృశ్చికము ౩.౫౪ ఉ॥7.39ని॥ వివాహము.

## మార్గశిరమాసము

15-12-18 మార్గశిర శుక్ల ౮/౯ శనివారము ఉత్తరాభాద్రాయుక్త తుల ౫౩.౪౫ రా॥3.58ని॥ వివాహము (రాజ, ౬ చంద్రః).

21-12-18 మార్గశిర శుక్ల ౧౪ శుక్రవారము రోహిణీయుక్త కన్య ౪౫.౩౮ రా॥12.47ని॥ ఆవశ్యక వివాహాదులు (ధనుర్మాసము).

26-12-18 మార్గశిర కృష్ణ ౪/౫ బుధవారము మఘాయుక్త వృశ్చికము ౪౩.౫౯ రా॥4.10ని॥ ఆవశ్యక వివాహము (ధనుర్మాసము).

## మాఘమాసము

06-02-19 మాఘ శుక్ల ౨ బుధవారము శతతారాయుక్త కుంభము ౪.౫౩ ఉ॥8.35ని॥
మీనము ౬.౪౩ ఉ॥9.19 ఉపనయన వివాహాదులు,
వృశ్చికము ౪౬.౯ రా॥1.8ని॥ (మార్తాండ రహితము) వివాహము (౧౨ చంద్రః).

07-02-19 మాఘ శుక్ల ౩ గురువారము శతతారాయుక్త కుంభము ౪.౪౩ ఉ॥8.31ని॥, మీనము ౬.౩౩ ఉ॥9.15ని॥ ఉపనయన వివాహాదులు (౧౨ చంద్రః).

09-02-19 మాఘ శుక్ల ౪ శనివారము ఉత్తరాభాద్రాయుక్త కుంభము ౪.౩౩ ఉ॥8.26ని॥
వివాహాదులు, మీనము ౬.౨౩ ఉ॥9.15ని॥ (లగ్న చంద్రః),
౫ రేవతీయుక్త వృశ్చికము ౪౫.౪౮ ప॥12.54ని॥ వివాహము.

10-02-19 మాఘ శుక్ల ౫ ఆదివారము రేవతీయుక్త కుంభము ౪.౨౨ ఉ॥8.21ని॥ ఉపనయన వివాహాదులు, మీనము ౬.౧౨ ఉ॥9.5ని॥.

11-02-19 మాఘ శుక్ల ౬ సోమవారము అశ్వినీయుక్త మీనము ౬.౨ ఉ॥9.00ని॥.

15-02-19 మాఘ శుక్ల ౧౦/౧౧ శుక్రవారము మృగశిరాయుక్త మీనము ౫.౧౦ ఉ॥8.37ని॥ వివాహాదులు, గృహారంభాదులు.

18-02-19 మాఘ శుక్ల ౧౪ సోమవారము పుష్యమీయుక్త మీనము ౪.౪౭ ఉ॥8.26ని॥.

20-02-19 మాఘ కృష్ణ ౧ బుధవారము మఘాయుక్త మీనము ౪.౨౯ ఉ॥8.18ని॥ (౬ చంద్రః) వివాహాదులు.

21-02-19 మాఘ కృష్ణ ౨/౩ గురువారము ఉత్తరఫల్గునీయుక్త వృశ్చికము ౪౩.౫౨ రా॥12.3ని॥ వివాహము.

22-02-19 మాఘ కృష్ణ ౩ శుక్రవారము హస్తాయుక్త మీనము ౪.౭ ఉ॥8.9ని॥ (౭ చంద్రః) వివాహాదులు, గృహారంభము

23-02-19 మాఘ కృష్ణ ౪/౫ శనివారము చిత్రాయుక్త వృశ్చికము ౪౩.౩౪ రా॥11.56ని॥ వివాహము (౧౨ చంద్రః).

24-02-19 మాఘ శుక్ల ౫/౬ ఆదివారము స్వాతీయుక్త వృశ్చికము ౪౩.౨౫ రా॥11.51ని॥ (౧౨ చంద్రః) వివాహము.

28-02-19 మాఘ కృష్ణ ౯ గురువారము మూలాయుక్త మీనము ౩.౧౩ ఉ॥7.43ని॥ వివాహాదులు, ౧౦ వృశ్చికము ౧౨.౪౯ రా॥11.34ని॥ వివాహము.

## ఫాల్గునమాసము

08-03-19 ఫాల్గున శుక్ల ౨ శుక్రవారము రేవతీయుక్త వృశ్చికం ౪౧.౩౬ రా॥10.59ని॥ (మార్తాండ రహితము) వివాహము.

09-03-19 ఫాల్గున శుక్ల ౩ శనివారము రేవతీయుక్త వృశ్చికము ౪౧.౨౭ రా॥10.54ని॥ వివాహాదులు.

10-03-19 ఫాల్గున శుక్ల ౪ ఆదివారము అశ్వనీయుక్త మీనము ౧.౪౨ ఉ॥7.00ని॥ వృశ్చికము ౪౧.౧౮ రా॥10.50ని॥ (౬ చంద్రః) వివాహాదులు.

13-03-19 ఫాల్గున శుక్ల ౭ బుధవారము రోహిణీయుక్త మీనము ౧.౧౫ ఉ॥6.47ని॥ వృశ్చికము ౪౦.౫౧ రా॥10.38 (౭ చంద్రః), ౮ మృగశిరాయుక్త మకరము ౫౩.౩ రా॥3.31ని॥ వివాహము.

16-03-19 ఫాల్గున శుక్ల ౧౦/౧౧ శనివారము పుష్యమీయుక్త వృశ్చికము ౪౦.౨౪ రా॥10.25ని॥ గృహప్రవేశము.

20-03-19 ఫాల్గున శుక్ల ౧౪/౧౫ ఉత్తరఫల్గునీయుక్త మకరము ౫౨.౪ రా॥3.02ని॥ వివాహము.

21-03-19 ఫాల్గున శుక్ల ౧౫/కృష్ణ ౧ గురువారము హస్తాయుక్త మకరము ౫౧.౫౫ రా॥2.57ని॥ వివాహము.

22-03-19 ఫాల్గున కృష్ణ ౨ శుక్రవారము చిత్రాయుక్త మకరము ౫౧.౪౭ రా॥2.54ని॥ కుంభము ౫౮.౯ ఉ॥5.26ని॥ వివాహము.

23-03-19 ఫాల్గున కృష్ణ ౩ శనివారము చిత్రాయుక్త మేషము ౫.౪౬ ఉ॥8.29ని॥ స్వాతీయుక్త మకరము ౫౧.౩౯ రా॥2.49ని॥, కుంభము ౫౮.౦౦ రా॥5.21ని॥ వివాహము.

24-03-19 ఫాల్గున కృష్ణ ౪ ఆదివారము స్వాతీయుక్త మేషము ౫.౩౮ ఉ॥8.24ని॥ వివాహము శుభమ్.



## జనన ప్రకరణము

అశ్విని 1వ పాదం తండ్రికి - భరణి 4వ పాదం శిశువుకు - కృత్తిక 4వ పాదం తల్లికి - రోహిణి మేనమామకు, తండ్రికి - ఆర్ద్ర తల్లికి - పుష్యమి 2,3 పాదములు పగలు తండ్రికి, రాత్రి తల్లికి - ఆశ్లేష 2వ పాదం శిశువుకు, 3వ పాదం తల్లికి, 4వ పాదం తండ్రికి - మఘ 1,2 పాదములు తండ్రికి - పూర్వఫల్గుని 4వ పాదం తల్లికి - ఉత్తరఫల్గుని 1వ పాదం పగలు తండ్రికి, రాత్రి తల్లికి - హస్త 3వ పాదం పుత్రుడైన తండ్రికి, పుత్రికయైన తల్లికి - చిత్ర 1వ పాదం తల్లికి, 2వ పాదం తండ్రికి - విశాఖ 4వ పాదం తల్లికి - జ్యేష్ఠ 1వ పాదం తల్లికి, 2వ పాదం సోదరులకు, మేనమామలకు, 3వ పాదం శిశువులకు, 4వ పాదం తండ్రికి - మూల 1వ పాదం తండ్రికి, 2వ పాదం తల్లికి, 3,4 పాదములు ధనమునకు - పూర్వాషాఢ 3వ పాదం తండ్రికి - పూర్వాభాద్ర 4వ పాదం శిశువునకు - రేవతి 4వ పాదం తండ్రికి గండము కాన యథావిధిగా శాంతి జరుపవలెను. కృష్ణ చతుర్దశి, అమావాస్య, వర్జ్యము, గ్రహణ కాలములందు గాని, మాతాపితృ సోదరుల జన్మ నక్షత్రములందు జననమైనను, నాళ వేష్ట (ప్రేగు మెడలోవేసుకుని) జననమైనను వికృత జననమైనను ఆయా విశేషశాంతులను జరుపుకొనవలెను.

## జన్మనక్షత్రమును బట్టి గ్రహదశలెఱుంగుట

| | | |
|---|---|---|
| కృత్తిక, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ | రవిదశ | 6 సంవత్సరములు |
| రోహిణి, హస్త, శ్రవణ | చంద్రదశ | 10 సంవత్సరములు |
| మృగశిర, చిత్ర, ధనిష్ఠ | కుజదశ | 7 సంవత్సరములు |
| ఆర్ద్ర, స్వాతి, శతతార | రాహుదశ | 18 సంవత్సరములు |
| పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర | గురుదశ | 16 సంవత్సరములు |
| పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర | శనిదశ | 19 సంవత్సరములు |
| ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి | బుధదశ | 17 సంవత్సరములు |
| మఘ, మూల, ఆశ్విని | కేతుదశ | 7 సంవత్సరములు |
| పూర్వఫల్గుని, పూర్వాషాఢ, భరణి | శుక్రదశ | 20 సంవత్సరములు |

## జన్మరాశి, నామరాశి వల్ల చేయు కార్యములు

గృహము, వాస్తుకర్మ, వ్యవహారము, మంత్రము, యంత్రము, దానము, చుట్టరికము, రాజసేవ, భూబలము, వర్గు శుద్ధి, యుద్ధము, యాత్రాదులకు నామ నక్షత్రము చూడవలయును. తక్కిన వివాహాది శుభకార్యములకును, శరీరమును గురించిన శుభాశుభములకు జన్మ నక్షత్రమును చూడవలయును. నలుబది సంవత్సరములకు పైన జన్మనక్షత్రము చూడగూడదను వాడుకయున్నది. ఇది శాస్త్రమునకు విరుద్ధము. జన్మముండు వరకు జన్మనక్షత్రము చూడవలయును.

## తిథ్యంత గండములు

అమావాస్య ప్రతిపత్తులయొక్కయు, దశమ్యేకాదశుల యొక్కయు, పూర్ణిమా ప్రతిపత్తులయొక్కయు సంధియందు రెండు ఘడియలు శిశుగండము.

## గండ పురుషస్థితి

చైత్ర - భాద్రపద - ఆశ్వయుజ - కార్తిక మాసములయందు పాతాళంబునను, వైశాఖ - శ్రావణ - మాఘ - ఫాల్గున మాసములందు స్వర్గలోకంబునను, జ్యేష్ఠ - ఆషాఢ - మార్గశీర్ష - పౌష్య మాసములందు భూలోకమున సంచరించును. భూలోకమున సంచరించునపుడు రజస్వల, ప్రసూతి మొదలగునవి సంభవించిన యెడల మరణము కలుగజేయును. తక్కిన రెండు ప్రదేశములయందు శుభము కలుగజేయును.

## రాశిగండములు

మీనమేషముల యొక్కయు, కర్కటక సింహముల యెక్కయు, వృశ్చిక ధనుస్సుల యెక్కయు సంధి యందు అర్ధఘటిక శిశు గండము. ఈ దుష్ట నక్షత్రాదికమునందు జననమైన శిశువుకు అష్టోవాక్య జపమును, హోమమును, రుద్రాభిషేకమును, అశ్వత్థ ప్రదక్షిణములను, అన్నదానమును యథావిధిగాజేసిన యెడల ఆయా గండములకు శాంతియగును. తిథిగండమునకు వృషభమును, నక్షత్రగండమునకు గోవును, లగ్న గండమునకు కాంచనమును దానమియ్యవలెను.

విష ఘడియలలో మొదటి ఘడియయందు జననమయిన తండ్రికి, రెండవ ఘడియ తల్లికి, మూడవ ఘడియ ధనమునకు(ధనహాని), నాలుగవ ఘడియ శిశువునకు దోషము.

## జ్యేష్ఠా నక్షత్రమునందలి 10 భాగములు

| | | | |
|---|---|---|---|
| 1వ భాగం | తల్లితల్లికి | 6వ భాగం | శిశువంశమునకు |
| 2వ భాగం | తల్లి తండ్రికి | 7వ భాగం | ఉభయవంశములకు |
| 3వ భాగం | మేనమామకు | 8వ భాగం | సోదరులకు |
| 4వ భాగం | శిశువుతల్లికి | 9వ భాగం | శ్వశురునకు |
| 5వ భాగం | శిశువునకు | 10వ భాగం | సర్వమునకు నష్టము. |

## మూలా నక్షత్రమునందలి 12 భాగములు

| | | | |
|---|---|---|---|
| 1వ భాగం | తండ్రికి | 7వ భాగం | పినతల్లికి |
| 2వ భాగం | తల్లికి | 8వ భాగం | భార్యకు |
| 3వ భాగం | అన్నదమ్ములకు | 9వ భాగం | శిశువునకు |
| 4వ భాగం | అక్కచెల్లెళ్ళకు | 10వ భాగం | దారిద్ర్యం |
| 5వ భాగం | మామగారికి | 11వ భాగం | రాజ్యలాభం |
| 6వ భాగం | మేనత్తకు | 12వ భాగం | భాగ్యము కలుగును. |

## నామ నక్షత్రములను తెలుసుకొను విధము

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చు | చె | చో | ల | అశ్విని | రూ | రె | రో | త | స్వాతి |
| లీ | లూ | లె | లో | భరణి | తి | తు | తె | తో | విశాఖ |
| అ | ఈ | ఉ | ఏ | కృత్తిక | నా | నీ | నూ | నె | అనూరాధ |
| ఓ | వా | వీ | వూ | రోహిణి | నో | యా | యి | యు | జ్యేష్ఠ |
| వే | వో | కా | కి | మృగశిర | యె | యో | బా | బీ | మూల |
| కూ | ఖ | జ్ఞ | ఝ | ఆర్ద్ర | బూ | ధా | బా | ఢా | పూర్వాషాఢ |
| కె | కో | హా | హీ | పునర్వసు | బె | బో | జా | జీ | ఉత్తరాషాఢ |
| హూ | హె | హో | డ | పుష్యమి | జు | జే | జో | ఖా | అభిజిత్ |
| డీ | డూ | డే | డో | ఆశ్లేష | ఖి | ఖు | ఖె | ఖో | శ్రవణ |
| మా | మీ | మూ | మె | మఘ | గా | గీ | గు | గే | ధనిష్ఠ |
| మో | టా | టీ | టు | పూ.ఫ | గో | సా | సీ | సు | శతతార |
| టె | టో | పా | పీ | ఉత్తర | సే | సో | దా | ది | పూర్వాభాద్ర |
| పూ | ష | ణ | ఢ | హస్త | దు | శం | ఛా | ధా | ఉత్తరాభాద్ర |
| పె | పో | రా | రి | చిత్ర | దె | దో | చా | చీ | రేవతి |

## మేషాది జన్మరాశులకు ఘాతతిథ్యాదులను దెలుపు చక్రము

| లగ్నము | తిథి | వారము | నక్షత్రము | చంద్రః |
|---|---|---|---|---|
| మేషం | ౬ | ఆది | మఘ | జన్మ |
| వృషభం | ౪ | శని | హస్త | పంచమ |
| మిధునం | ౯ | సోమ | స్వాతి | సప్తమ |
| కర్కటకం | ౮ | బుధ | అనూరాధ | ద్వితీయ |
| సింహం | ౮ | శని | మూల | షష్ఠ |
| కన్య | ౯ | శని | శ్రవణ | దశమ |
| తుల | ౧౨ | గురు | శతతార | తృతీయ |
| వృశ్చికం | ౧౦ | శుక్ర | రేవతి | సప్తమ |
| ధనుస్సు | ౨ | శుక్ర | భరణి | ద్వితీయ |
| మకరం | ౧౨ | కుజ | రోహిణి | అష్టమ |
| కుంభం | ౪ | గురు | ఆర్ద్ర | ఏకాదశ |
| మీనం | ౨ | శుక్ర | ఆశ్లేష | ద్వాదశ |

## మాస ఫలము చూచు క్రమము

శుద్ధపాడ్యమి ప్రవేశమునందేనక్షత్రమగునో ఆనక్షత్రము లగాయతు తన నక్షత్రము వరకు లెక్కించి ఆ సంఖ్యను 9చే భాగించగా మిగిలిన శేషము 1వప్రయాణము, 2 మృష్టాన్న భోజనము, 3 తనుతాపము, 4 శౌర్యము, 5 విద్య, 6వవస్త్రలాభము, 7 శోకము, 8 అనంత పుణ్యము, 9 మహాఫలము కలుగును.

## తారాబలము చూచు క్రమము

జన్మ నక్షత్రములగాయతు నిత్యనక్షత్రము వరకు లెక్కపెట్టి 9చే భాగించగా మిగిలిన భాగము 1 జన్మతార, 2 సంపత్తార, 3 విపత్తార, 4 క్షేమతార, 5 ప్రత్యక్తార, 6వసాధనతార, 7 నైధనతార, 8 మిత్రతార, 9 పరమమైత్రతార అగుచున్నది.

ఈ తారలలో 2-4-6-8-9 తారలు మంచి ఫలమును, 1-3-5-7 తారలు దుష్టఫలమును యిచ్చును.

## చంద్రబలమును చూచు క్రమము

తన జన్మరాశి లగాయతు చంద్రుడున్న రాశివరకు గణన చేయగా 1-3-6-7-10-11 రాశులయందు చంద్రుడుండగా ధనలాభము, కార్యసిద్ధి, శుభమునిచ్చును. మిగతా రాశులయందు కార్యవిఘ్నము కలుగును. విశేషమేమనగా శుక్లపక్షమున 2,5,9 రాశులయందును, కృష్ణపక్షమున 4, 8, 12 రాశులయందును వుండగా తల్లి కుమారుని రక్షించినట్లు చంద్రుడు మనలను రక్షించును. శుక్ల పక్షమున చంద్రబలమున్ను, కృష్ణపక్షమున తారాబలమున్ను ముఖ్యముగా జూచుచుండవలయును.

## పురశ్శుక్ర దోషము

నూతన వధువు, గర్భిణీ స్త్రీ, శిశు సహిత యగు స్త్రీయును శుక్రుడు తూర్పు దిక్కుననున్నప్పుడు, పశ్చిమదిక్కునుండి వాయువ్య దిక్కునకు, ఉత్తరమునకు, ఈశాన్యమునకు, తూర్పు దిక్కునకు ప్రయాణం చేయగూడదు. పశ్చిమదిక్కునందు శుక్రుడున్నప్పుడు తూర్పు దిక్కునుండి ఆగ్నేయమునకు, దక్షిణమునకు, నైఋతి దిక్కునకు పశ్చిమమునకు వెళ్ళగూడదు. ఈ పురశ్శుక్ర దోషము ఏకగ్రామమందు, దుర్భిక్షమందు, రాజవిద్వరము వచ్చినపుడు, వివాహమునకు, తీర్థయాత్రలకు వెళ్ళునపుడు దోషము కాదు. భారద్వాజాంగీరస భృగ్వత్రివత్స కాశ్యపసవాసిష్ఠ గోత్రజుల వారిని ఈ పురశ్శుక్ర దోషమెప్పుడును బాధింపదు.

## పాయ్యి వేయుటకు

కృత్తిక, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, శతతార, రేవతి ఈ నక్షత్రములందును, ఆది, మంగళ, శనివారములందును ౩-౫-౧౦-౧౩-౧౫- తిథులయందును, వృషభ, మిధున, కన్య, తుల, ధనుర్మీన లగ్నములందును శుభము.

## స్త్రీ ప్రథమ రజోదర్శన గుణదోషములు

**తిథులు:** పాడ్యమియందు మహాపాపినియును, విదియయందు పుత్రవతియును, తదియయందు సౌఖ్యవతియును, చవితియందు వృషలియును, పంచమియందు శుభప్రదురాలును, షష్ఠియందు వికృత సంచారిణియును, సప్తమియందు శుభ ప్రదురాలును, అష్టమియందు వికృత సంచారిణియును, నవమియందు విశేషకష్టియును, దశమియందు పుత్రవతియును, ఏకాదశియందు శుచికలదియును, ద్వాదశియందు పతిని దూషించునదియును, త్రయోదశియందు పుత్రవతియును, చతుర్దశియందు కోపనయును, పూర్ణిమా_మావాస్యల యందు దుష్టచారిణియును అగును.

**నక్షత్రములు :** భరణి, ఆశ్లేష, పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్ర యీ నక్షత్రముల 1 వ పాదం భర్తృనాశనమును, 2 వ పాదం పుత్రనాశనమును, 3 వ పాదం ధన నాశనమును, 4 వ పాదం అశుభమును కలిగించును. మరియు కృత్తిక, ఆర్ద్ర, పునర్వసు, మఘ, జ్యేష్ఠ యీ నక్షత్రముల యొక్క 1 వ పాదం మంగళము గలిగించును. 2 వ పాదమునన్నైన 25గురికి భోజనము పెట్టవలయును. 3,4 పాదములందును, ఆది మంగళ శని వారములయందును, దుష్టకాలములయందును, దుష్టతిథులయందును దుష్టయోగములయందు రజస్వల అయినయెడల యథావిధిగా శాంతి చేయవలెను.

## బల్లి పాటునకు ఫలము

శిరస్సు - కలహము, ముఖము - బంధు దర్శనము, కనుబొమ్మల నడుమ - రాజానుగ్రహము, పై పెదవి - ధనవ్యయము, క్రింది పెదవి - ధనలాభము, ముక్కు చివర - కోపము, కుడిచెవి - దీర్ఘాయువు, ఎడమచెవి - వర్తకలాభము, నేత్రము - ఖైదు, గడ్డము - రాజదండనము, నోరు - భయము, కంఠము - శత్రు హాని, కుడి భుజము - స్త్రీ సంగమము, కుడి ముంజేయి - కీర్తి, ఎడమ ముంజేయి - రోగము, స్తనయుగ్మము - దోషము, ఉదరము - ధాన్యలాభము, రొమ్ము, నాభి - ధనలాభము, ప్రక్కలు - సుఖము, పాదము - ప్రయాణము, వీపు - శుభము, గోళ్ళు - ధన వ్యయము, లింగము - దారిద్ర్యము, జుట్టుకొన - మృత్యువు,

**ఈ ప్రదేశములయందు తొండ ప్రాకినను ఫలమిట్లేనని తెలియవలయును.**

## వాస్తు పురుష స్థితి

భాద్రపదాది 3 మాసములు తూర్పు శిరస్సుగాను, మార్గశీర్షాది 3 మాసములు దక్షిణ శిరస్సుగాను, ఫాల్గునాది 3 మాసములు పశ్చిమ శిరస్సుగాను, జ్యేష్ఠాది 3 మాసములు ఉత్తర శిరస్సుగాను, ఎడమ ప్రక్కగా వాస్తు పురుషుడు ఇంటి నిమిత్తము తీసుకొను స్థలమందు శయనించును. కావున అతని దృష్టి ప్రసరించిన దిక్కునను, పాదములందును గృహమును కట్టగూడదు.

## మృతికి దుష్ట నక్షత్రములు

భరణి, కృత్తిక, రోహిణి, పునర్వసు, మఘ, ఉత్తర, చిత్ర, విశాఖ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతతార, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి - ఈ నక్షత్రములయందును, ఆది, మంగళ, శుక్రవారముల యందును, ౧-౨-౩-౬-౧౧-౧౨-౧౩-౧౪-౩౦ ఈ తిథుల యందును మృతి సంభవించిన గృహమునకు దోషము. కేవలం తిథివల్ల దోషం లేదు. తిథి వారముల వల్ల స్వల్పదోషము. తిథి నక్షత్రముల వల్ల అర్ధదోషము. తిథి వార నక్షత్రముల వల్ల సంపూర్ణదోషము గలుగును. మృగశిర, చిత్ర ఇవి ద్విపాద నక్షత్రములు. ఈ నక్షత్రములయందు మృతి సంభవించిన 3 మాసములున్ను, భరణి, రోహిణి, మఘ, ధనిష్ఠా పంచకములు వీటియందు 6 మాసములున్ను గృహమును వదలవలయును.

## ఆశౌచ ప్రకరణము

శిశువు ప్రాణములతో పుట్టి నాభిచ్ఛేదనకు పూర్వమందు మరణము నొందెనేని తల్లికి పది దినములు మృతాశౌచమున్నూ, తండ్రికి, సోదరులకు మూడు దినములు జాతాశౌచము, మృతాశౌచము స్నానమాత్రముననే శుద్ధి. మృతప్రసవమైనను, నాభిచ్ఛేదనమయిన తరువాత శిశువు మరణించినను తండ్రి సోదరులకు జ్ఞాతులకు సంపూర్ణ జాతాశౌచము. మృతాశౌచము స్నానమాత్రం. తల్లికి దశరాత్ర మృతాశౌచము. పది దినముల లోపల శిశువు మరణించినయెడల జ్ఞాతులకు తల్లిదండ్రి, సోదరులకు, జాతాశౌచము. జననాది శేషముతో శుద్ధి. మృతాశౌచము స్నానమాత్రము. దంతజనన పర్యంతము జ్ఞాతులకు స్నానమాత్రము, చూడాకర్మ పర్యంతం ఒక దినము, ఉపనయన పర్యంతము, మూడుదినములు ఆశౌచము. వివాహమయిన స్త్రీ తండ్రియింట మరణించిన తల్లిదండ్రి, సోదరులు పెండ్లికాని పడుచులకు మూడుదినములు ఆశౌచము. పెండ్లియైన స్త్రీ తల్లిదండ్రుల మరణమునందు దశరాత్రములోగా త్రిరాత్రాశౌచము పట్టవలెను. సోదరీసోదరులకు సన్నిధానాసన్నిధానములయందు త్రిరాత్రాశౌచము. మాతామహుడు, మాతామహి, పినతల్లి పెత్తల్లులు, మేనమామ మేనత్త, దౌహిత్రుడు, పినతల్లి పెత్తల్లి బిడ్డలకు, మేనత్త మేనమామ బిడ్డలకు పురుష పర్యాయములో సన్నిధానమందు త్రిరాత్రము. గ్రామాంతరమునందు పక్షిణి. పక్షిణీ కాలాతి క్రమణమందు గ్రామాంతరమున వింటే ఆ పగలు, రాత్రివింటే ఆ రాత్రి ఉండి స్నానం. మేనమామ భార్యకు సన్నిధానంలో స్నానం. భార్య ఉండగా, సంతానం ఉండగా అత్తమామలు మరణించినయెడల సన్నిధానమందు మూడుదినములు, అసన్నిధానమందు పక్షిణి. భార్యసంతానము లేనియెడల సామీప్యమున ఒకరాత్రి అసన్నిధానమందు స్నానం.

సవతి తల్లి సోదరీ సోదరులు మరణించినపుడు సమీపమునందు ఒక దినము. దేశాంతరమందు స్నానమాత్రం. సవతి కూతురు మరణించినపుడు సవతితల్లికొక దినము. సవతి తల్లి పోయినపుడు సవతి కూతురికొక దినము ఆశౌచము. దూరమందైనయెడల స్నానముతోసరి. అల్లుని మరణముసమీపమునందు జరిగినయెడల అత్తమామలకు మూడుదినములు. గ్రామాంతరమందు పక్షిణి. జ్ఞాతులకు దశాహానంతరమందు మూడు మాసముల వరకు మూడుదినములు, ఆరుమాసముల వరకు పక్షిణి, సంవత్సర పర్యంతం ఒక రాత్రి ఆశౌచము. మహానది అడ్డమున్నయెడల అతిక్రాంతాశౌచము, త్రిరాత్రము లేదు. జ్ఞాతులకు త్రిరాత్రాతిక్రమణమందు స్నానమాత్రమే.

తల్లిదండ్రులు చనిపోయినపుడు వారికి ప్రేతక్రియలు జరగనియెడల తాము బ్రతికియుండు కాలములో ఎన్నడు విన్నను 11 దినములు ఆశౌచము. ప్రేతకృత్యములు జరిగినయెడల 20 సంవత్సరములలో నెపుడు విన్నను 10 దినములు ఆశౌచము. అనేక ఆశౌచ సన్నిపాతమందు దశరాత్ర మృతాశౌచము పడుచుండగా దశరాత్ర మృతముగాని, త్రిరాత్రమృతముగాని సంభవించెనేని ప్రథమాశౌచముచే నివృత్తి. దశరాత్రజాతాశౌచమును పట్టుచుండగా త్రిరాత్రమృతాశౌచము వచ్చినను జాతాశౌచముచే నివృత్తి గాని మృతాశౌచముచే అధిక జాతాశౌచము పోదు. దశరాత్రమృతాశౌచము మధ్య దశరాత్రజాతాశౌచము వచ్చిననూ మృతాశౌచము చేతనే నివృత్తి. దశరాత్రమృతాశౌచము నవలంబించియుండగా దశమదినమున రాత్రి వేరొక మృతాశౌచము వచ్చినయెడల మొదటి యాశౌచము పూర్తియైన పిమ్మట అనగా పదియవ రాత్రి 3వ యామమందు వినిన 9 దినములు మృతాశౌచము పట్టవలెను. చరమదినాష్టమయామమనగా సూర్యోదయాత్పూర్వమున వేరొక పూర్ణ మృతిని వినిన 3 దినములాశౌచము. పుత్ర పుత్రికా జనన సంబంధియగు జాతాశౌచము నవలంబించియుండగా వేరొక మృతాశౌచము వచ్చినను మృతాశౌచము వదిలి జాతాశౌచమునే పట్టవలెను.

## పూర్ణాహుతి కాలము

పూర్ణాహుతి చేయదలచిన రోజున శుక్లప్రతిపదాదిగా తిథులున్నూ భానువారాదిగా వారములున్నూ 1 కలిపిన మొత్తమును నాల్గుచే భాగించగా 1, 2 మిగిలిన అగ్నిహోత్రుడు పాతాళమందుండును. కనుక ప్రాణ, ధన హానిన్ని 3, 4 మిగిలిన అగ్నిహోత్రుడు భూమియందుడును గనుక సౌఖ్య, ధనలాభమున్నూ కలుగును. సూర్యుడున్న నక్షత్రము మొదలు నిత్యనక్షత్రము వరకు 'రవి, బుధ, శుక్ర, శని, చంద్ర, కుజ, గురు, రాహుకేతువు”లగును. రవ్యాదిగ మూడేసి నక్షత్రముల చొప్పున లెక్కించగా శుభగ్రహ సంబంధమైన నక్షత్రము శుభమును, క్రూరగ్రహ సంబంధమైన నక్షత్రము అశుభమును కలుగజేయును.

# పాణిగ్రహణోపయోగ పంచకూట ప్రసూతి రజస్వలా శాంతి నక్షత్ర విమర్శన చక్రము

| నక్షత్రము | పాదము | గణ కూటము | పార్శ్వ మధ్య | యోని కూటము | రాశి కూటము | | ప్రసూతి శాంతి | రజస్వల శాంతి |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | స్వర్ణం | దేవ | పార్శ్వ | అశ్వం | స్త్రీ రాశ్యాది ౨ | మృత్యువు | ౧ పా - శాంతి | శుభం |
| భరణి | స్వర్ణం | మనుష్య | మధ్య | గజం | | | ౩ పా - శాంతి | ౧౦ మాస శాంతి |
| కృత్తిక | స్వర్ణం | రాక్షస | అంత్య | అజం | పురుష రాశ్యాది ౧౨ | | ౩ పా - శాంతి | శాంతి ౪మా |
| రోహిణి | స్వర్ణం | మనుష్య | అంత్య | సర్పం | స్త్రీ ౧౨ | ఆయుర్వృద్ధి | శాంతి | శుభం |
| మృగశిర | స్వర్ణం | దేవ | మధ్య | సర్పం | పురుష ౨ | | శుభం | శుభం |
| ఆర్ద్ర | రజతం | మనుష్య | పార్శ్వ | శునకం | స్త్రీ ౩ | దుఃఖం | సామాన్య శాంతి | శాంతి ౬మా |
| పునర్వసు | రజతం | దేవ | పార్శ్వ | పిల్లి | పురుష ౧౧ | కేచిత్సుఖం | శుభం | శాంతి ౫మా |
| పుష్యమి | రజతం | దేవ | మధ్య | మేషం | స్త్రీ ౧౧ | సుఖం | ౨,౩ పా - శాంతి | శుభం |
| ఆశ్లేష | రజతం | రాక్షస | అంత్య | పిల్లి | పురుష ౩ | కేచిద్దుఃఖం | శాంతి | శాంతి ౬మా |
| మఘ | రజతం | రాక్షస | అంత్య | మూషక | స్త్రీ ౪ | దారిద్ర్యం | ౧ పా - శాంతి | శాంతి ౬మా |
| పూర్వఫల్గుని | రజతం | మనుష్య | మధ్య | మూషక | పురుష ౧౦ | | శాంతి | శాంతి ౮మా |
| ఉత్తరఫల్గుని | రజతం | మనుష్య | పార్శ్వ | వృషభ | స్త్రీ ౧౦ | ధనలాభం | ౧ పా - శాంతి | శుభం |
| హస్త | రజతం | దేవ | పార్శ్వ | మహిష | పురుష ౪ | | శాంతి | శుభం |
| చిత్ర | రజతం | రాక్షస | మధ్య | వ్యాఘ్రం | స్త్రీ ౫ | అశుభం | ౧,౨ పా -శాంతి | శుభం |
| స్వాతి | రజతం | దేవ | అంత్య | మహిష | పురుష ౯ | | ౩ పా - శాంతి | శుభం |

| నక్షత్రము | పాదము | గణ కూటము | పార్శ్వ మధ్య | యోని కూటము | రాశి కూటము | | ప్రసూతి శాంతి | రజస్వల శాంతి |
|---|---|---|---|---|---|---|---|---|
| విశాఖ | లోహం | రాక్షస | అంత్య | వ్యాఘ్రం | స్త్రీ ౬ | } శుభం | శుభం | శుభం |
| అనూరాధ | లోహం | దేవ | మధ్య | మృగి | పురుష ౮ | | శాంతి | శుభం |
| జ్యేష్ఠ | లోహం | రాక్షస | పార్శ్వ | మృగి | స్త్రీ ౯ | } పుత్రహాని | శాంతి | శాంతి ౪మా |
| మూల | లోహం | రాక్షస | పార్శ్వ | శునకం | పురుష ౫ | | శాంతి | శుభం |
| పూర్వాషాఢ | తామ్రం | మనుష్య | మధ్య | వానరం | స్త్రీ ౫ | } పుత్రలాభం | ౩ పా - శాంతి | శాంతి ౭మా |
| ఉత్తరాషాఢ | తామ్రం | మనుష్య | అంత్య | ముంగిస | పురుష ౯ | | శుభం | శుభం |
| శ్రవణ | తామ్రం | దేవ | అంత్య | వానరం | స్త్రీ ౧ | } మంగళప్రదం | శుభం | శుభం |
| ధనిష్ఠ | తామ్రం | రాక్షస | మధ్య | సింహం | పురుష ౧ | | శుభం | శుభం |
| శతతార | తామ్రం | రాక్షస | పార్శ్వ | అశ్వం | | | శుభం | శుభం |
| పూర్వాభాద్ర | తామ్రం | మనుష్య | పార్శ్వ | సింహం | | | శాంతి | శాంతి ౭మా |
| ఉత్తరాభాద్ర | తామ్రం | మనుష్య | మధ్య | గోవు | | | శుభం | శుభం |
| రేవతి | స్వర్ణం | దేవ | అంత్య | గజం | | | శాంతి | శాంతి |



## శంఖుస్థాపనాది ముహూర్తములకు యోగ్యమైన తిథి వార నక్షత్రాదులను, లగ్నములను, విశేషములను తెలియజేయు చక్రము

ఈ ముహూర్తములకు ఏకవింశతి దోషములు లేక యుండవలెను. పాపగ్రహ క్రాంత, వేధ, రాహిత్యముగానుండవలెను.

| ముహూర్తములు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| శంఖుస్థాపనము | ౨,౩,౫,౭, ౧౦,౧౩ | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్విని, రోహి, మృగ, పున, పుష్య, ఉ.ఫ, హస్త, చిత్ర, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా, రేవ | వృష, మిథు, కన్య, ధను, కుంభ, మీన | చతుర్థ శుద్ధి |
| గృహప్రవేశము | ౨,౩,౫,౭, ౧౦,౧౩ | సోమ, బుధ, గురు, శుక్ర | రోహి, మృగ, ఉ.ఫ, చిత్ర, అనూ, ఉ.షా, ధని, శత, ఉ.భా, రేవ–శుభం, పుష్యమి–మధ్యమం | వృష, మి, సిం, కన్య, వృశ్చి, ధ, కుం, మీ | ద్వాదశ శుద్ధి |
| గర్భాధానము | ౨,౩,౫, ౭,౧౦ | సోమ, బుధ, గురు, శుక్ర | రోహి, మృగ, పున, పుష్య, ఉ.ఫ, హస్త, చిత్ర, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా | మేష,వృష,కర్క, క,తు,ధను,మీన | లగ్నశుద్ధి,పంచపర్వ వ్రతదినములు కాని దినములు |
| పుంసవనము సీమంతము | ౨,౩,౫,౭, ౧౦,౧౩,౧౫ | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, రో, మృ,పున, పుష్య, ఉ.ఫ, హస్త, చిత్ర, స్వాతి,అనూ,మూ,ఉ.షా, శ్రవ,ధ,శ,ఉ.భా, రేవ | వృశ్చి,సిం వినా యితర పుం ల॥ | ౬ శుద్ధి, ౩ వ మాసము సీమంతము ౪–౬౮మా |
| నామకరణము | ౨,౩,౫,౭, ౧౦,౧౧,౧౪ | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, రో, పున, పుష్య, పు.ఫ, ఉ.ఫ, హస్త, స్వా, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా, రే | వృష,మిథు,కర్క, కన్య,తు,ధ,మీన | అష్టమ శుద్ధి, పక్షఛిద్రములు కాని దినములు |
| అన్నప్రాశనము | ౨,౩,౫,౭, ౧౦,౧౩ | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, ఉ.ఫ, హస్త, చి, స్వా, అనూ, ఉ.షా, శ్రవ, ధని, ఉ.భా, రేవ | వృష,మిథు,కర్క, కన్య,తుల,ధ,మీ | ౧౦ శుద్ధి పురుషులకు, సరిసమానం–స్త్రీ బేసి మాస |
| కేశఖండనము | ౨,౩,౫,౭, ౧౦,౧౩ | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్విని, మృగ, పున, పుష్యమి, హస్త, చిత్ర, స్వాతి, అనూ, శ్రవ, ధని, శత, రేవతి | వృష,మిథు,కర్క, కన్య,తు,ధ,మీన | ఉత్తరాయణము పూర్వయామము |
| అక్షరాభ్యాసము | ౨,౩,౫, ౭,౧౦ | సోమ, బుధ, గురు, శుక్ర | అశ్విని, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్రా, స్వాతి, అనూరాధ, శ్రవణ, రేవతి | మేష, కర్కటక, తుల, మకర | ౮శుద్ధి ఉత్తరాయణం ౫సం॥ |
| విద్యాభ్యాసము | ౨,౩,౫,౭, ౧౦,౧౧ | ఆది,సోమ, బుధ,గు,శుక్ర | అశ్వి, మృ, ఆర్ద్ర, పున,పుష్య,ఆశ్లే, పూ.ఫ,హస్త, చిత్ర, స్వాతి, మూల, పూ.షా, శత, పూ.భా | కర్కటక, తుల, మకర, మీన | అష్టమశుద్ధి అనధ్యాయ రహితము |

